# జీవన్, హనుల పరిచయం

# మేధావి మనస్సులతో

మేధావితనం అనేది సృజన శక్తిలోగాని, కనిపెట్టడంలోగాని, సహజ సిద్ధమైన, అసాధారణ ఊహా శక్తిగల సామర్థ్యం. చిన్న వయస్సులోనే మేధావితనం కనబరిచే పిల్లలను బాల మేధావులంటారు.





ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ (1879-1955) అత్యంత ప్రతిభ గల ఒక శాస్త్రవేత్త. ఆయన భౌతిక శాస్త్రం అభ్యసించి, 25 ఏళ్ల వయస్సులో సాపేక్ష సిద్ధాంతం రూపొందించారు. ఇందులో ఆయన గురుత్వాకర్షణ, విద్యుదయస్కాంతశక్తి, అణుశక్తులను గురించి వివరించడానికి కొన్ని సూత్రాలను కల్పించారు.

బహుముఖ మేధావులు చాల అరుదుగా ఉంటారు—ఇటలీకి చెందిన లియొనార్డో డా విన్సీ (1452-1519) అలాటి వారిలో ఒకరు. ఆయన చిత్రకారుడు, శిల్పి, యంత్రకారుడు, వాస్తు శాస్త్రజ్ఞుడు. ఆయన మానవ శరీర నిర్మాణం, ప్రకృతి, వైమానిక యంత్ర శాస్త్రాలను గురించి అభ్యసించారు. ఇంచు గురించి ఆయన సచిత్రంగా పుస్తకాలలో వ్రాసిపెట్టి ఉంచారు. చిత్రకారుడుగా ఆయన సుప్రసిద్ధ కళారచన 'మోనాలిసా'. అది ప్రపంచంలో అత్యంత విలువగల వర్ణచిత్రంగా భావించబడుతూ ఉంది!

శ్రీనివాస రామానుజం (1887-1920) మన దేశంలోనే జన్మించిన ఒక గణిత మేధావి. 16 ఏళ్ల వయస్సులో ఆయన తానే స్వయంగా సాధించిన 6,000 సిద్ధాంతాలను సేకరించారు. అప్పటికి వ్యాప్తిలో ఉన్న గణిత శాస్త్రం గురించి తెలియకపోయినా స్వయంగా అనేక సిద్ధాంతాలను రూపొందించారు, రామానుజం. ఇంగ్లండులోని రాయల్ సొసైటీ ఆఫ్ లండన్‌కు ఎన్నికైన మొట్టమొదటి భారతీయుడు రామానుజం. అవిరామభిన్నంపై ఆయన సాధించిన ప్రావీణ్యం ఇతర ఏ గణిత శాస్త్రజ్ఞులు కూడా సాధించలేక పోయారు.





సంగీతంలో పేరు నిలిచిన ఒక బాల మేధావి ఆస్ట్రియాదేశపు సంగీత కూర్పరి డబ్ల్యూ. ఎ. మొజార్ట్ (1756-1842). ఆయన ఐదేళ్ల వయస్సులో సంగీత రచనలు చేయడం మొదలు పెట్టారు! ఆ వెనువెంటనే వయొలిన్ వాయించడంలో పరిపూర్ణత సాధించి కచేరీలు చేయడం మొదలుపెట్టారు. 16 ఏళ్ల వయస్సులో వయొలిన్ మానివేసి, అప్పటికి బాగా నేర్చుకున్న పియానో చేపట్టారు!



జీవిత భీమా అనేది
మీ భవిష్యత్తును కాపాడు
కొనడానికి అతి క్షేమకరమైన,
తెలివైన మార్గం. దాన్ని గురించి
తెలుసుకోండి.







లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

వచ్చేసారి: జీవన్, హనులు నోబెల్ బహుమతి గురించి తెలుసుకుంటారు.

**Results of Chandamama—Camlin Colouring Contest No. 19 (Telugu)**

*1st Prize:* Joginder Shandilay, Juliundur; *2nd Prize:* C. H. Satyanaraya, Tenali; *3rd Prize:* N. Sreenivas, Hyderabad-35; *Consolation Prizes:* Vara Sujeeva Raju, Kothapeta; B. V. S. S. Kameshwari, Bhilai Nagar; Pichika Srinivas, Rajahmundry; D. Anand, Hyderabad-20; S. Nagamani, Hyderabad-20.



# చందమామ

ఆగష్టు 1981



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-75

సంవత్సర చందా: 21-00

సీతాకోకచిలకా, సీతాకోకచిలకా, రావే రావే
నన్ను చూడు, నాతోటనిచూడు, పూలని చూడవె రావే
సీతాకోకచిలకా, యిదిగో జెమ్స్ యివి నీకోసం
నీకోసం, మరి నాకోసం, మన అందరికోసం








చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!

క్యాడ్‌బరీస్ చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి

OBM/6742/TL

## *CHANDAMAMA*
## PRESENTS




# WALT DISNEY COMICS

IN
FIVE MORE
LANGUAGES




HINDI




MARATHI




BENGALI




KANNADA




GUJARATI

Available
at all news-stands
from 5 August 1981

## *CHANDAMAMA*
## CLASSICS & COMICS

a reading delight
Fortnight after
fortnight

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["మారే మనసులు"] కు ఆధారం గుంటక సాంబిరెడ్డి రచన.

ఎంతటి గాఢస్నేహితులైనా ఒకరి కష్టసుఖాల్లో మరొకరు పాలు పంచుకునే మనస్తత్వం లేనివారైతే, వాళ్ళు ఇళ్ళనే కాదు, తలుచుకుంటే లోకాన్నే ఇరుకుమయం చేయగలరన్న సత్యాన్ని, "ఇంటి యిరుకు" అన్న కథ రుజువు చేస్తుంది.

## అమరవాణి

యది సంతి గుణాః పుంసాం వికసంత్యేవ తే పునః,
న హి కస్తూరికామోదః శపథేన విభావ్యతే.

[కస్తూరిని దాచినా, పరిమళం దాగదు; అదేవిధంగా మనిషిలో దాగివున్న మంచి గుణాలు తప్పక బయటపడి తీరుతాయి.]

సంపుటి 69 అగష్టు '81 సంచిక 2

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# నోరులేని బతుకు

అలవాటుకొద్దీ పోలయ్య పెళ్ళాం, ఇల్లు ఊడ్చిన కసువంతా మొండి గోడ మీదుగా పక్కింటి ఆవరణలో పోసి వెనుదిరుగుతూనే కంగారు పడిపోయింది.

ఆమె గబగబా భర్త దగ్గిరకు వచ్చి, "పక్కింటి ఆవరణలో చెత్త కుమ్మరించాను. వాళ్లు దెబ్బలాటకు వస్తారో ఏమో. కాస్త వెళ్లి నచ్చజెప్పిరా," అన్నది.

పోలయ్య గాభరా పడిపోయాడు. అతడికి తగవులంటే మహా చెడ్డభయం.

ఇంతకాలంగా వాళ్ల పక్కిల్లు ఖాళీగా వున్నది. పోలయ్య భార్య బద్ధకం కొద్దీ వీధిలోకి వెళ్ళక, ఊడ్చిన కసువంతా పక్కింటి ఖాళీ స్థలంలో పోసేసేది. ఆ ఇంటి యజమాని పట్నంలో వ్యాపారి. అతను యిన్నాళ్ళకు ఇల్లు అమ్మ గలిగాడు. క్రితం రోజే ఎవరో పెద్ద మేకల మందతో ఆ ఇంట ప్రవేశించారు.

పోలయ్య పెళ్ళాన్ని చీవాట్లు పెట్టి, మొండి గోడ మీదుగా తొంగి చూశాడు. పెరట్లో ఒక నలభై ఏళ్ళ మనిషి మేకలకు తుమ్మకాయలు మేపుతున్నాడు.

"మాకు వీధి దూరం, ఇన్నాళ్ళూ చెత్త యీ ఖాళీ స్థలంలో పోశాం. ఇవ్వాళ కూడా మా ఆవిడ అజాగ్రత్తకొద్దీ అలాగే చేసింది," అంటూ జరిగింది, ఆ మనిషికి చెప్పాడు పోలయ్య.

పోలయ్య యిలా చెపుతూండగానే ఆ మనిషి గోడ దగ్గిరకు వచ్చి, "మీరేం మొహమాట పడకండి. మీ చెత్త అంతా మా పెరట్లోనే వేయండి. నా పెళ్ళాం ఎలాగూ పెరడంతా ఊడుస్తుంది గదా! అప్పుడు మీ చెత్త కూడా ఎత్తి పారేస్తుంది," అన్నాడు.

పోలయ్య నిర్ఘాంతపోయాడు. ఆ మనిషి మరీ నోరులేని సత్తెకాలపువాడని అతనికి

మాచిరాజు కామేశ్వరరావు

తెలిసిపోయింది. మాటల సందర్భంలో ఆ మనిషి పేరు అవతారం అనీ, మేకలే అతడి అస్తి అనీ తెలుసుకున్నాడు, పోలయ్య.

అతడు లోపలికి వచ్చి భార్యతో, "వాడు పేరుకు తగ్గట్టు ఒట్టి అవతారంలా వున్నాడు. చెత్తంతా వాళ్లింటివైపునే గుమ్మరించు," అని, జరిగింది చెప్పాడు.

ఆ తరవాత నాలుగు రోజుల్లోనే వాళ్లకు అవతారం అమాయకత్వం పూర్తిగా అర్థమైపోయింది.

ఒకరోజున పోలయ్య, "నీ మేకల అరుపులతో మాకు రాత్రిళ్లు నిద్రపట్టటం లేదు. గ్రామాధికారికి చెప్ప మంటావా ?" అని, అవతారాన్ని గట్టిగా దబాయించాడు.

అవతారం గజగజలాడిపోతూ, "బాబూ, నా కున్న ఆస్తి యీ మేకలే. నా కడుపు కొట్టవద్దు," అంటూ పోలయ్యను బతిమాలాడు.

"మేక పాలు తాగితే రాత్రిళ్ళు బాగా నిద్ర పడుతుందట! రోజూ శేరు మేక పాలు పంపు. ఆ విధంగానైనా రా[illegible] నీ మేకల అరుపులు మాకు తెలియకుండా పోతుంది," అన్నాడు పోలయ్య.

"మహరాజుగా పంపుతాను. పగలు ఒక శేరు, రాత్రి ఒక శేరు," అన్నాడు అవతారం.



అది మొదలు పోలయ్య, అవతారం నోరులేనితనాన్ని ఆసరాగా తీసుకుని, అతని చేత అడ్డమైన చాకిరీ చేయించుకోసాగాడు. తన ఇంటి అవసరాలకు బావిలోంచి నీళ్లు తోడటం, మొక్కల కోసం నేల తవ్వటం, తన చిల్లరకొట్టు కోసం పట్నం నుంచి తెచ్చిన సామాను, బండి నుంచి దింపటం—ఇలాంటి పనులన్నీ కిక్కురుమనకుండా అవతారం చేసేవాడు.

పోలయ్య ప్రతి నెలా పట్నం నుంచి తన చిల్లరకొట్టుకు కావలసిన సామానులు తెచ్చుకునేవాడు. అందుకోసం అతను చీకటితోనే పట్నం బయలుదేరి వెళ్లేవాడు. ఒకరోజున అలా వెళుతూ, భార్యను



తలుపు వేసుకోమన్నాడు. మంద నుంచి ఎలా బయటికి వచ్చిందో ఒక మేక పిల్ల అరుస్తూ గుమ్మం ముందు గిరికీలు తిరుగుతున్నది.

దాన్ని చూస్తూనే పోలయ్య భార్యకు మెరుపులాంటి ఒక ఆలోచన వచ్చింది. ఆమె భర్తతో, "పాపం, ఈ మేక పిల్లకు పల్లెబతుకంటే మొహం మొత్తినట్టుంది. ఎత్తుకుపోయి పట్నంలో అమ్మెయ్యి. పాతిక రూపాయిలన్నా రాకపోవు. చీకటి మాటున ఎవరు చూడవచ్చార్లే!" అన్నది.

పోలయ్య మేకపిల్లను భుజానవేసుకుని వెళ్ళిపోయాడు. సాయంత్రం పాతిక రూపాయల లాభంతో యిల్లు చేరాడు.

"ఆ డబ్బు యిలాతే! మేకలు అమ్మిన డబ్బుతో నేను నగలు చేయించుకోవాలి," అంటూ, ఆ డబ్బు కొంగున ముడి వేసుకున్నది పోలయ్య భార్య.

"మేకలు అమ్మిన డబ్బా! మరెన్ని మేకల్ని అమ్మదలిచావు?" అంటూ పోలయ్య ఆశ్చర్యపోయాడు.

"అవతారం మంద అంతా అయిపోయేదాకా. అతడికి అనుమానం కలక్కుండా ఒక ఆలోచన కూడా చేశాలే," అని, అదేమిటో పోలయ్య చెవిలో చెప్పింది భార్య.

ఇంతలో మొక్కలకు నీళ్ళు పోయటానికి అవతారం వాళ్ళింటికి వస్తూనే, "మా మందలోంచి ఒక మేకపిల్ల కనబడకుండాపోయింది, బాబూ," అన్నాడు.

పోలయ్య, భార్య చెప్పినట్టుగా, "ఇలాంటిదేదో జరుగుతుందని, నేను ఏనాటినుంచో అనుకుంటున్నదే! సందేహం లేదు, ఇది పిశాచం పనే. దానికి మేకలంటే మహా ప్రీతి గదా!" అన్నాడు.

"పిశాచం మా అత్తవారివైపు చుట్టమే కదా. అది యింత పని చేస్తుందా?" అన్నాడు అవతారం ఆశ్చర్యపోతూ.

అవతారం భార్య మేనత్త మహా గయ్యాళి. ఆమె పేరు అవతారం ఎరగడు. అంతా ఆమెను పిశాచమనే పిలుస్తారు.



అవతారం ఆమె పేరు పిశాచమనే అను కుంటున్నాడు.

పోలయ్య జాలి పడుతున్నట్టు ముఖం పెట్టి, "నిజానికి చుట్టాలే నమ్మించి గొంతు కోస్తారు," అన్నాడు.

అవతారం వెళ్ళి పోయాక మొగుడు పెళ్ళాలిద్దరూ సంబరపడిపోతూ, "మన ఎత్తు పారింది. అతడి పిశాచి చుట్టం ధర్మమా అని, కొన్ని నగలు అమరు తాయి," అనుకున్నారు.

"ఈసారి పట్నం వెళ్ళేటప్పుడు, కాస్త పెద్ద మేకను తీసుకుపో. వంద రూపా యలు వస్తాయి," అన్నది పోలయ్య భార్య

ఈ మధ్య కొంతకాలంగా అక్కడ జరుగుతున్న గొడవతోపాటు, ఆ భార్యా భర్తల సంభాషణ కూడా, పక్కనే రావి చెట్టు మీద వున్న ఒక పిల్ల పిశాచి విన్నది. దాని అసలు నివాసం వల్లకాట్లోని ఒక చింత చెట్టు. పక్కనే వున్న మర్రి చెట్టు మీద వుండే ఒక పెద్ద పిశాచి, దాన్ని ఆటలు పట్టించేది; అడ్డమైన చాకిరీ చేయించుకునేది.

పిల్ల పిశాచి ఆ చాకిరీ చేయలేక ఏడుపు ముఖం పెడితే, "నేను, నిన్నేమీ రాచి రంపాన పెట్టటం లేదు. పోలయ్య, అవ తారం చేత చేయించుకునే చాకిరీలో అవ గింజంతయినా, నీ చేత చేయించుకోవటం లేదు. ఆ అవతారాన్ని చూసి బుద్ధి తెచ్చుకో," అనేది పెద్ద పిశాచి.

ఇప్పుడు పిల్ల పిశాచికి, పెద్ద పిశాచి పెట్టే బాధల నుంచి బయటపడేందుకు ఒక ఉపాయం తోచింది.

మళ్లీ పట్నం ప్రయాణం పెట్టుకున్న పోలయ్య, జాము రాత్రి మిగిలి వుండగానే అవతారం పాకలోకి దూరి, అన్నింటి కన్నా బలంగా వున్న ఒక మేకను తోలు కుని పట్నం బయలుదేరాడు. దారిలో ఒక చిట్టడవి వున్నది. మరీ చీకటితో బయలుదేరడంవల్ల పోలయ్యకు భయంగా వున్నది. ధైర్యం కోసం పిచ్చి పదాలు పాడుతూ నడుస్తూండగా, మేకకు

కొమ్ములు మొలిచినట్టు, అతడికి కనిపించింది. మరి కొంతదూరం వెళ్ళేసరికి దానికి గడ్డమూ ఒంటి మీద పులిచారలూ వచ్చాయి.

పోలయ్య కంపించిపోతూ, తన ఊరు కేసి పరిగెత్తసాగాడు. మేక పులిలా భీకరంగా అరుస్తూ, అతణ్ణి పొలిమేర దాకా తరిమి, గబ్బిలంగా మారి, వల్ల కాట్లోని చింతచెట్టు మీదికి ఎగిరిపోయింది.

పోలయ్య యిల్లు చేరి, భార్యకు జరిగినదంతా చెప్పి, "నేను ప్రాణాలతో ఇల్లు చేరానంటే, అది నీ మంగళసూత్రం బలం అనుకోవాలి! అవతారాన్ని మనం తక్కువ అంచనా వేశాం. అతడికి క్షమాపణ చెప్పుకుందాం, పిశాచం నిజంగానే అతడి చుట్టం!" అన్నాడు.

పోలయ్య భార్య భయంతో వణుకుతూ, అప్పటికప్పుడే మొండిగోడ దగ్గరకుపోయి అవతారాన్ని కేకవేసింది. అవతారం రాగానే, "మమ్మల్ని క్షమించు. పిశాచాన్ని మా మీదికి ఉసికొల్పవద్దు. నీ చేత యిక వెట్టి చాకిరీ చేయించుకోము," అంటూ భార్యాభర్తలు అతడి చేతులు పట్టుకుని బ్రతిమాలి, అప్పటివరకూ అయిన పాల డబ్బూ, మేకపిల్ల డబ్బూ అణా పైసలతోసహా లెక్క కట్టి ఇచ్చేశారు.

అవతారానికి యిదేం బోధపడక, "మా అత్తగారి వైపు చుట్టం అంటే, వీళ్ళకు భయం అన్నమాట!" అనుకున్నాడు మనసులో.

మేకగా మారి పోలయ్యను హడలెత్తించిన పిల్ల పిశాచి, పెద్ద పిశాచికి రావి చెట్టు మీద కూర్చుని, యీ జరిగినదంతా చూపించి, "ఇక యీ మొగుడూ, పెళ్లాలు అవతారంచేత అడ్డమైన చాకిరీ చేయించుకోరు. నువ్వు, వీళ్ళను చూసి అయినా బుద్ధి తెచ్చుకో," అన్నది.

పెద్ద పిశాచి విరగబడి నవ్వి, "నోరు లేని బతుకు యిలాగే వుంటుంది. నువు, పోలయ్యకు బుద్ధి చెప్పావు, సరే. నాకు బుద్ధి చెప్పేవాడు వచ్చేదాకా, నీకు మాత్రం అడ్డమైన గాడిదచాకిరీ తప్పదు," అన్నది.






## 16

[వ్యాఘ్రదత్తుడి కంటబడకుండా పారిపోయిన సమరసేనుడు శిధిలనగరం చేరాడు. అక్కడికి వ్యాఘ్రదత్తుడు తన భటులతో వచ్చాడు. శాక్తేయుడి అపూర్వశక్తులు గల త్రిశూలం, ఏనుగులవనంలోని గురుద్రోహి అస్థిపంజరంలో వున్నదని తెలుసుకున్నాడు. వ్యాఘ్రదత్తుడికి హఠాత్తుగా ఆ ప్రదేశాన మరెవరో మనుషులున్నారన్న అనుమానం కలిగింది. తరవాత—]

సమరసేనుడూ, సైనికులూ దాగివున్న వైపుకు చూస్తూ, వ్యాఘ్రదత్తుడు తన భటులతో, "ఒరే, యిక్కడ శిధిల భవనాల చాటున మరెవరో దాగివున్నారు. వాళ్ళు మన ప్రబల శత్రువు శివదత్తుడూ, అతడి అనుచరులూ కావచ్చు. ముందు వాళ్ళను పట్టి బంధించాలి," అన్నాడు.

ఆ మాటలతో సమరసేనుడు రానున్న ప్రమాదాన్ని గుర్తించాడు. తన దగ్గిర వున్న ఆరుగురు సైనికులతో వ్యాఘ్రదత్తుణ్ణి ఎదిరించటం, ఆత్మహత్యతో సమానమని అతడికి తోచింది. ఇప్పటి పరిస్థితుల్లో తను చేయవలసింది, సాధ్యమైనంత త్వరగా ఆ ప్రదేశాన్ని వదిలిపోవటం!

ఇంతలో వ్యాఘ్రదత్తుడి భటులు భయంకరంగా అరుస్తూ, ఒక్కుమ్మడిగా సమరసేనుడు దాగివున్న శిధిల భవనం కేసి దూకారు. సమరసేనుడు సైనికులను



హెచ్చరించి, అక్కడినుంచి వెను దిరిగాడు.

ఆరుగురు సైనికులూ, సమరసేనుడూ ఒకవైపు; ఇరవైమంది భటులూ, వారి నాయకుడైన వ్యాఘ్రదత్తుడూ మరొక వైపు—యిక ఆ ప్రదేశమంతా వాళ్ళ కేక లతో, హెచ్చరికలతో మార్మోగిపోయింది.

శిధిలభవనాల్లోని గదులలో, గోడల చాటునా దాక్కుంటూ సమరసేనుడూ, సైనికులూ అక్కడి నుంచి తప్పించుకో జూస్తున్నారు. కాని, వ్యాఘ్రదత్తుడు తన భటులను రెండు ముఠాలుగా చేసి, వాళ్ళను చుట్టుముట్టేందుకు పురి గొల్పాడు.

విరిగిన స్తంభాల చాటునా, పడి పోయిన గోడల మాటునా పొంచి వుండి, దగ్గిరకు వచ్చిన వ్యాఘ్రదత్తుడి భటులను, సమరసేనుడూ, సైనికులూ ఎదుర్కొన సాగారు. వ్యాఘ్రదత్తుడి భటులలో ఎక్కువమందిని అక్కడ బలిపెట్టకుండా తను పారిపోగలగటం అసంభవంగా తోచింది సమరసేనుడికి.

వ్యాఘ్రదత్తుడు తన భటులకు ధైర్యం చెబుతూ, తనే స్వయంగా సమరసేనుణ్ణి ఎదిరించాలనుకున్నాడు. అప్పటికే అతడి భటులలో కొందరు సమరసేనుడి కత్తి దెబ్బలకు నేల కొరిగారు.

ఎటు చూసినా కేకలూ, గాయపడిన వాళ్ళ మూలుగులూ—ఆ ప్రదేశమంతా భీకరంగా వున్నది. అటువంటి సమ యంలో వ్యాఘ్రదత్తుడు ముందుకు దూకి సమరసేనుణ్ణి ఎదిరించాడు.

అతి బలశాలులూ, ధైర్యవంతులూ అయిన సమరసేన, వ్యాఘ్రదత్తుల మధ్య కత్తి యుద్ధం ప్రారంభమైంది. వాళ్ళ పాదాల అదురుకూ, గురితప్పి తగిలే కత్తి దెబ్బలకూ శిధిలమైపోతూ ఒరిగి వున్న స్తంభాలూ, గోడలూ కిందపడసాగినై. అలా పడుతున్న వాటి రాళ్ళనుంచి పక్కకు తప్పుకుంటూ, వాళ్ళు అతి భీక రంగా యుద్ధం చేయసాగారు.

ఇలా పోరు కొంతసేపు జరిగే సరికి వ్యాఘ్రదత్తుడు అలసిపోయాడు. ఇది గ్రహించిన సమరసేనుడు, అతణ్ణి హతమార్చేందుకు మరింత తీవ్రంగా పోరాడసాగాడు.

ఈలోగా సంఖ్యలో రెట్టింపు వున్న వ్యాఘ్రదత్తుడి భటులు సమరసేనుడి సైనికులను బంధించగలిగారు. సైనికులలో యిద్దరు ముగ్గురు బాగా గాయపడిపోయారు. ఈ విధంగా సైనికులను బంధించిన వ్యాఘ్రదత్తుడి భటులు, తమ నాయకుడికి సహాయ పడేందుకు బయలుదేరారు. కోలాహలం అణగిపోవటం, తన సైనికుల కేకలు వినబడకపోవటం వల్ల, తన వాళ్ళందరూ శత్రువుల వల్ల బంధించబడటమో, చంపబడటమో జరిగివుంటుందని, సమరసేనుడు గ్రహించాడు.

ఇక యిప్పుడు తను సాధ్యమైనంత శీఘ్రంగా వ్యాఘ్రదత్తుణ్ణి తుదముట్టించి, అక్కడినుంచి పారిపోవాలి!

ఇలా ఆలోచిస్తూ సమరసేనుడు రెట్టించిన పౌరుషంతో వ్యాఘ్రదత్తుడితో పోరసాగాడు. తనపై వ్యాఘ్రదత్తుడి భటులు వెనకనుంచి దెబ్బతీయకుండా వుండేందుకు ఒక గోడనానుకుని సమరసేనుడు యుద్ధం చేస్తున్నాడు. కాని, పాపం అతడికి తను అనుకుని వున్న గోడ శిథిలావస్థలో వున్నదనీ, విరిగి వెనక్కు కూలిపోయేందుకు సిద్ధంగా వున్నదనీ తెలి






యదు. కాని, ముందుండి పోరాడుతున్న వ్యాఘ్రదత్తుడు యీ సంగతి గ్రహించాడు.

హఠాత్తుగా వ్యాఘ్రదత్తుడి భటుల కఠోర కంఠాలు ఒక్క సారిగా మార్మోగినై. వాళ్ళు సమరసేనుడి సైనికులందరినీ బంధించి, తమ నాయకుడికి సహాయ పడేందుకు మూక ఉమ్మడిగా ముందుకు దూకుతున్నారు. రానున్న ప్రమాదాన్ని గుర్తించిన సమరసేనుడు, తన కత్తితో వ్యాఘ్రదత్తుడి మీదికి మెరుపు వేగంతో లంఘించి, గోడ మీదినుంచి దూకేందుకు, ఎగిరాడు.

సమరసేనుడు అలా గోడమీదికి ఎగిరే సరికి, అసలే శిథిలమై కూలిపోయేందుకు సిద్ధంగా వున్న గోడ కాస్తా ఫెళఫెళ మంటూ ఒక్కసారిగా విరిగి వెనకకు పడిపోయింది. దానితోపాటు సమర సేనుడు అవతలి వైపుకుపడి, రాళ్ళమధ్య చిక్కుకుపోయాడు.

వ్యాఘ్రదత్తుడికి యిది మంచి అవకాశం కలిగించింది. అతడు పెద్దగా విజయధ్వానం చేస్తూ, సమరసేనుడి మీదికి ఉరికాడు. అంతలో అతడి భటులు పరుగున అక్కడికి వచ్చి, సమరసేనుడి కాళ్ళూ, చేతులూ గట్టిగా పట్టుకుని కదలకుండా చేశారు.

వ్యాఘ్రదత్తుడు ఆజ్ఞాపించగానే సమర సేనుడి చేతులు తాళ్ళతో బంధించబడినై. అతడి కత్తిని వ్యాఘ్రదత్తుడు స్వాధీన పరుచుకున్నాడు.

తన శత్రువు చేజిక్కాడన్న సంతోషంతో వ్యాఘ్రదత్తుడు పరవశుడై పోయాడు. అతడు క్రూరంగా నవ్వుతూ, "చివరికి ఎలా అయితేనేం, నా చేతికి చిక్కావు! మొదట నాకు తటస్థపడి నప్పుడే, నాతో రాజీ పడి వున్నట్టయితే, నీకీనాడు యీ దుర్గతి పట్టేది కాదు. శాక్తేయుడి అపూర్వ శక్తులుగల త్రిశూలం ఎక్కడ వున్నదీ నాకు తెలిసిపోయింది. నీకు మాత్రం దుర్మరణం తప్పదు!" అన్నాడు.

వ్యాఘ్రదత్తుడి మాటలకు సమర సేనుడు చలించలేదు. ఒకవేళ తనకు దుర్మరణమే తప్పనిసరైతే, అందుకు అతడు సిద్ధంగానే వున్నాడు. అతడికి అప్పట్లో తనను గురించి కన్న, తన నాయకత్వాన్ని నమ్ముకుని కష్టాలపాలైన సైనికులను గురించే ఎక్కువ బాధ కలిగింది. సేనాని అయిన తను సైనికులకు సరైన నాయకత్వం యివ్వలేకపోయానా, అని అతడు ఆలోచించసాగాడు.

సమరసేనుడి మౌనాన్ని వ్యాఘ్రదత్తుడు మరో విధంగా భావించాడు. నిబ్బరంగా, నిశ్చింతగా వున్న సమరసేనుడి వాలకం వ్యాఘ్రదత్తుణ్ణి కలత పరిచింది. ఎవరి సహాయాన్నో అండగా చూసుకుని అతడు అలా నిర్భయంగా వున్నాడని వ్యాఘ్రదత్తుడు అనుమానించాడు.

"నీకు యీ కష్టదశలో సహాయపడగల వారెవరూ లేరు. ఆ సంగతి గుర్తుంచుకో!" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

తను ఇలా అన్నప్పుడు, సమరసేనుడు తనకు సహాయం వచ్చే వాళ్ళ పేర్లు చెబుతాడని వ్యాఘ్రదత్తుడు ఆశించాడు.

వ్యాఘ్రదత్తుడి భయసందేహాలను నిశిత బుద్ధి అయిన సమరసేనుడు గ్రహించాడు. అతణ్ణి బెదిరించి చూస్తే తనకు మేలు కలగవచ్చునని అతడు ఊహించాడు.



"వ్యాఘ్రదత్తా! శాక్తేయుడి త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలిసినది, నీ ఒక్కడికే కాదు, ఆ సంగతి గుర్తుంచుకో! అంతే కాక, ఆ త్రిశూలం ఎక్కడ వున్నదీ తెలిసినంత మాత్రాన ప్రయోజనం లేదు," అన్నాడు సమరసేనుడు.

ఈ జవాబుతో వ్యాఘ్రదత్తుడు నివ్వెరపోయాడు. శాక్తేయుడి త్రిశూలం శిథిల నగరంలోని ఏనుగుల వనంలో వున్నదని శివదత్తుడికి తెలుసు. తను తన భటులకు చెపుతూండగా సమరసేనుడు కూడా చాటున వుండి విన్నాడు.

"త్రిశూలం ఎక్కడ వున్నదీ చాటున వుండి నువు విన్నావని, నాకు తెలుసు.

శివదత్తుడికి కూడా అది వున్నచోటు తెలుసు. అయినా నీవూ, అతడూ కూడా నన్ను అడ్డగించగలిగిన స్థితిలో లేరు. అలాంటప్పుడు ఆ దివ్యశక్తులుగల త్రిశూలాన్ని నాచేత బడకుండా చేయుగల వారెవరు ?'' అని వ్యాఘ్రదత్తుడు కోపంగా ప్రశ్నించాడు.




సమరసేనుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా, ఊరికే నవ్వి వూరుకున్నాడు. ఆ విధంగా వ్యాఘ్రదత్తుడిలో అనుమానాన్ని మరింతగా ఎక్కువ చేయాలని సమరసేనుడి యత్నం. అది ఫలిస్తుందనేందుకు సూచనగా వ్యాఘ్రదత్తుడి ముఖం వెలవెల పోవటం సమరసేనుడి కంటబడింది.

''త్రిశూలం నీచేత బడకుండా ఆటంక పరచగలవాళ్ళు యిద్దరున్నారు. వారిలో ఒకణ్ణి మాత్రం ప్రస్తుతానికి బంధించగలిగావు. కాని, ఆ త్రిశూలం నీ కంటబడక ముందే నిన్ను హతమార్చగలవాడు మరొకడున్నాడు. అతడు నాకు మిత్రుడు. అతడి ఆజ్ఞాపాలన కోసమే, నేను నీ వ్యాఘ్రమండలానికి బయలుదేరాను. ఇప్పుడు సంగతి తెలిసిందా ?'' అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు ఆ మాటలకు కలవరపడ్డాడు. శత్రువుల మీద తన విజయం అనుకున్నంత తేలిక కాదని, అతడికి సంశయం కలిగింది.

''నన్ను ఆటంక పరచగల వాడి పేరేమిటి?'' అని అడిగాడు వ్యాఘ్రదత్తుడు.

''చతుర్నేత్రుడు!'' అన్నాడు సమరసేనుడు.

చతుర్నేత్రుడు అన్న మాట వ్యాఘ్రదత్తుడిలోనే కాక అతడి భటుల్లో కూడా సంచలనం కలిగించింది. భటులు భయకంపితులై తమ నాయకుడి కేసి చూడసాగారు. అది గమనించిన వ్యాఘ్రదత్తుడు లేని ఉత్సాహాన్నీ, ధైర్యాన్నీ కనబరుస్తూ, ''ఓహోఁ, అతగాణ్ణి నువ్వొరుగుదువన్న మాట !'' అంటూ నవ్వాడు.

"అతడి అజ్ఞవల్లనే, నేనిక్కడికి వచ్చాను. ఆ సంగతి యింతకు ముందే చెప్పాను, గుర్తుంచుకో!" అన్నాడు సమరసేనుడు.

ఆ జవాబు వింటూనే వ్యాఘ్రదత్తుడు నిలువెల్లా వణికిపోయాడు. చతుర్నేత్రుడిని గురించీ, అతడికి గల అద్భుత శక్తులను గురించీ అతడు విని వున్నాడు.

ఇప్పుడేం చేయటమా అని వ్యాఘ్రదత్తుడు ఆలోచించేంతలో, దూరంగా సైనికుల కోలాహలం వినబడింది. అంతలో ఒక భటుడు పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చి, "అయ్యా, శివదత్తుడు తన అనుచరులతో శిథిలనగరం ప్రవేశించాడు." అని చెప్పాడు.

వ్యాఘ్రదత్తుడి నెత్తిన పిడుగు పడినట్లయింది. తన దగ్గిర వున్న కొద్దిమంది భటులతో శివదత్తుణ్ణి ఎదుర్కోవటమో లేక అక్కడి నుంచి పలాయనం చేయటమో తప్ప అతడికి మార్గాంతరం లేదు. కాని, సమరసేనుణ్ణి ఏం చేసేట్టు? ఆ క్షణంలోనే అతణ్ణి తుదముట్టించటం మంచిదని తోచినా, అది ప్రమాదమని అతడికి భయం కలిగింది. తన మిత్రుడి మరణానికి కోపగించిన చతుర్నేత్రుడు మొత్తం వ్యాఘ్రమండలాన్నే నాశనం చేయగలడు!

"సమరసేనా! ఇప్పటికీ—యింత జరిగిన తరవాత కూడా మనిద్దరం రాజీ పడటం నీకూ, నాకూ కూడా క్షేమమని భావిస్తున్నాను. ఆ రాజీ మాటలేమిటో యిద్దరం తీరిగ్గా కూర్చుని చర్చించాలి. మనం యిక్కడి నుంచి మరొక సురక్షిత ప్రదేశానికి వెళదాం," అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

తరవాత నిరాయుధుడైన సమరసేనుణ్ణి వెంటబెట్టుకుని వ్యాఘ్రదత్తుడూ, అతడి భటులూ వేగంగా అక్కడి నుంచి పారిపోసాగారు. వాళ్ళకు దూరంగా శివదత్తుడి అనుచరులతో పోరు సల్పుతున్న వ్యాఘ్రదత్తుడి మిగిలిన భటుల కేకలు వినబడుతున్నవి.

—(ఇంకా వుంది)






# మారే మనసులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనుషులు క్షణక్షణానికీ తమ మనసు ఎందుకు మార్చుకుంటారో తలచు కుంటే చాలా ఆశ్చర్యం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా నీకు, విక్రమ వర్మ, సమరసేనుల కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

విక్రమపురి, ఆనందపురి రెండూ ఇరుగు, పొరుగు రాజ్యాలు. రెండు రాజ్యాల మధ్య అనాదిగా శత్రుత్వం వున్నది. కొన్ని తరాలుగా పరిస్థితులు విషమించినప్పుడల్లా, ఆ రెండు రాజ్యాల మధ్యా యుద్ధాలు జరిగాయి. ప్రతిసారీ

## బేతాళ కథలు




రాజ్య గౌరవప్రతిష్ఠలు ఎంతగానో యినుమడిస్తాయి,'' అన్నాడు.

ఇందుకు సేనాని సమరసేనుడు వ్యతిరేకిస్తూ, రాజుతో, ''మహారాజా, ఈ నాటివరకూ, ఈ రెండు రాజ్యాలమధ్యా జరిగిన యుద్ధాలవల్ల, ప్రజలెంతగానో నష్టపోయారు. రెండు రాజ్యాలూ సమానమైన బలం గలవి కావడంతో, ఒకదాన్నొకటి జయించలేకపోయాయి. కారణం లేకుండానే, కొన్ని తరాలుగా ఏదో ఆనవాయితీగా యీ యుద్ధాలు జరుగుతున్నట్టు తోస్తున్నది. మనం విక్రమపురితో స్నేహం పాటించడం, అన్ని విధాలా మంచిది,'' అన్నాడు.

ఈ యుద్ధాల్లో ఎంతో ధన, జననష్టం జరిగేది. కాని, ఏ ఒక్క రాజ్యమూ రెండవదాన్ని గెలవలేకపోయేది.

ఈ తరంలో విక్రమపురికి విక్రమవర్మ రాజయాడు. ఆనందపురికి ఆనందవర్మ రాజుగా, భద్రపాలుడు మంత్రిగా, సమరసేనుడు సేనాధిపతిగా వచ్చారు.

ఆనందవర్మ రాజవుతూనే, విక్రమపురిని జయించాలని పట్టుబట్టాడు. ఇందుకు మంత్రి భద్రపాలుడు, రాజును పూర్తిగా సమర్థిస్తూ, ''విక్రమపురిని జయించడం ద్వారా, మన పూర్వీకులు సాధించలేని పనిని మనం సాధించినవాళ్ళమవుతాం. ఆ విధంగా మన ఆనందపురి

కాని, రాజు ఆనందవర్మ, సమరసేనుడి సలహాను కాదని, వెంటనే యుద్ధ ప్రయత్నాలు ప్రారంభించమన్నాడు. ఆ తరవాత సమరసేనుడు సైనికులకు శిక్షణ యివ్వడంలోనూ, కోట రక్షణలను మరింత కట్టుదిట్టం చేయడంలోనూ నిమగ్నుడయాడు. మంత్రి భద్రపాలుడు యుద్ధావసరాలకుగాను ప్రజల నుంచి మరింతగా పన్నులు వసూలు చేసే పని ప్రారంభించాడు.

విక్రమపురి రాజైన విక్రమవర్మ, మంచి వీరుడే గాక, పరిపాలనాదక్షతా, సూక్ష్మబుద్ధీ కలవాడు. అతడు, ఆనందవర్మ

యుద్ధప్రయత్నాలను గురించి తన గూఢచారుల ద్వారా తెలుసుకుని, శత్రు దాడిని ఎదుర్కొనేందుకు తన సేనల్ని సర్వసన్నద్ధంగా వుంచాడు.

కొద్ది రోజులు జరిగాయి. ఆనందవర్మ తన రాజ్యాన్ని ముట్టడించకముందే, తాను ఆనందపురిని ముట్టడించడం మంచిదన్న నిర్ణయానికి వచ్చాడు, విక్రమవర్మ. ఆ వెంటనే అతడు సైన్యాలతో ఆనందపురి మీదికి దాడివచ్చాడు.

రాజు ఆనందవర్మ తన సైన్యాలకు కోట నుంచి బయిటికిపోయి, విక్రమవర్మ సేనలను ఎదుర్కొవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు. ఇరుపక్షాల సేనల మధ్య కొన్ని రోజులపాటు భయంకర యుద్ధం జరిగింది. విక్రమవర్మ తన సేనలకు స్వయంగా నాయకత్వం వహించి నడుపుతున్నాడని తెలిసి, ఆనందవర్మ కూడా తానే సేనానాయకత్వం తీసుకున్నాడు. ఇది జరిగిన మరసటి రోజున, శత్రుపక్షం నుంచి వచ్చిన విషం పూసిన బాణం దెబ్బతిని అతడు మరణించాడు.

సమరసేనుడు వెంటనే సైన్యాలను కోట లోపలికి నడిపి, కోట తలుపులు మూయించాడు. ఆనందవర్మకు వారసులు లేకపోవడంతో, యిప్పుడేం చేయాలన్న సమస్య ఎదురైంది. తమ రాజు చని



పోయాడు గనక, తాము యుద్ధంలో ఓడినట్టు ఒప్పుకుని, విక్రమవర్మతో సంధి చేసుకుందాం అన్నాడు మంత్రి భద్రపాలుడు.

సమరసేనుడు యిందుకు వ్యతిరేకిస్తూ, ''మన కోట చాలా బలమైనది. కొన్ని నెలలకు సరిపడా ఆహార పదార్థాల నిల్వ వున్నది. ఇక్కడ వుండే యుద్ధం సాగిద్దాం. మనల్ని జయించలేననే అభిప్రాయం విక్రమవర్మకు కలిగాకనే సంధి రాయబారాలు నడుపుదాం. ఇప్పుడైతే అతడి సంధి షరతులు చాలా కఠినంగా వుండే అవకాశం వున్నది.'' అన్నాడు.



కోటను పట్టుకునేందుకు విక్రమవర్మ చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. అతడు కోట ముట్టడి ఎత్తివేసి, తిరిగి తన రాజ్యానికి పోదామన్న ఆలోచనలో వుండగా, భద్రపాలుడివల్ల అతడికి విజయావకాశాలు కనిపించినై.

ఆనందవర్మ మరణించాక సమరసేనుడు తానే ఆనందపురికి రాజు కావాలని చూస్తున్నాడన్న అనుమానం భద్రపాలుడికి కలిగింది. అలా జరిగితే, తన మంత్రిపదవికి ముప్పు రావచ్చు. అందువల్ల అతడు, కోటను విక్రమవర్మకు స్వాధీనం చేసి, తన మంత్రిపదవిని కాపాడుకోవాలనుకుని, చారుల ద్వారా విక్రమవర్మతో రహస్యంగా రాయబారాలు ప్రారంభించాడు.

భద్రపాలుడి కుట్ర ఫలితంగా ఒక నాటి అర్ధరాత్రి కోట విక్రమవర్మ స్వాధీనమైంది. సమరసేనుడూ, యితర ముఖ్యులూ ఖైదు చేయబడ్డారు. భద్రపాలుడు ఆశించినట్టుగా విక్రమవర్మ, సమరసేనుణ్ణి బహిరంగంగా ఉరి తీయించలేదు.

ఒకనాడు విక్రమవర్మ, సమరసేనుణ్ణి ఖైదు నుంచి తన దగ్గిరకు పిలిపించుకుని, "నీకు ఉరిశిక్ష విధించాలని నిశ్చయించాను. కాని, నీవు నా పట్ల రాజభక్తి ప్రకటించినట్లయితే, నీ ప్రాణాలు కాపాడటమేగాక, సేనాధిపతి పదవి యిస్తాను. ఏమంటావు?" అని అడిగాడు.

సమరసేనుడు తాను ఉరిశిక్ష పడేందుకైనా సిద్ధమే గాని, విక్రమవర్మ వద్ద సేనాధిపతి పదవికి అంగీకరించనన్నాడు.

"సరే, నువు చివరిసారిగా చెప్పుకో దలచినదేమైనా ఉంటే, చెప్పుకోవచ్చు," అన్నాడు విక్రమవర్మ.

"తరతరాలుగా, విక్రమపురి, ఆనంద పురి రాజ్యాలమధ్య జరుగుతున్న యుద్ధాలకు కారణం, కొద్దిమంది మూర్ఖత్వం అని నాకు తోస్తున్నది. ఏమైనా, యిప్పుడు మీరు జయించారు. ఆనందపురి రాజ్య

ప్రజలను హింసలపాలు చేయకుండా, న్యాయంగా పాలించవలసిందిగా తమరిని కోరుతున్నాను," అన్నాడు సమరసేనుడు.

విక్రమవర్మ, సమరసేనుణ్ణి ఉరి తీయించే నిర్ణయం మార్చుకుని, అతణ్ణి ఖైదునుంచి విడుదల చేశాడు. కాని అతడి చర్యలను గమనిస్తూండేందుకు వేగులను నియమించాడు. విక్రమవర్మ తనను మంత్రిగా నియమిస్తాడని భద్రపాలుడు అనుకున్నాడు. కాని, ఎంత కాలం జరిగినా రాజు నుంచి అతడికి పిలుపు రాలేదు. విక్రమవర్మ అతడి సంగతే పూర్తిగా మరిచిపోయాడు.

క్రమంగా విక్రమవర్మ తన న్యాయ పరిపాలన ద్వారా ప్రజలలో మంచి పేరు సంపాయించాడు. తనకు వ్యతిరేకంగా యుద్ధంలో పాల్గొన్న రాజోద్యోగులెవర్నీ శిక్షించలేదు. ఆ పరిస్థితుల్లో ఒక రోజున సమరసేనుడు విక్రమవర్మ దర్శనం చేసుకుని, అతడి కొలువులో తనకెలాంటి నౌకరీ యిచ్చినా, చేయడానికి సిద్ధంగా వున్నానని తెలియజేశాడు.

విక్రమవర్మ చాలా సంతోషించి, సమరసేనుణ్ణి తన ప్రధాన సలహాదారుగా నియమించుకుని, తాను నగరంలో లేనప్పుడు అతడు తన ప్రతినిధిగా రాజ్య వ్యవహారాలు చూస్తాడని ప్రకటించాడు.



బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, విక్రమవర్మ, సమరసేనుల పట్ల నా కనేక సందేహాలు కలుగుతున్నాయి. సమరసేనుడు మొదట్లో యుద్ధాన్ని వ్యతిరేకించి విక్రమవర్మతో స్నేహాన్నిపాటిద్దామన్నాడు. తీరా, యుద్ధం ప్రారంభమై, తన రాజు ఆనందవర్మ మరణించినప్పుడు, సంధికి వ్యతిరేకించాడు. అలాగే, మొదట విక్రమవర్మ యివ్వజూపిన సేనాపతి పదవిని నిరాకరించి, తరవాత అతడి కొలువులో ఎలాంటి ఉద్యోగం చేయడానికైనా సిద్ధపడ్డాడు.

"ఇక విక్రమవర్మ, సమరసేనుణ్ణి ఉరితీయిద్దామనుకుని ఆ ప్రయత్నం

మాని అతడికి సేనానిపదవి యివ్వ జూపాడు. అతడు దాన్ని నిరాకరించినా కోపగించుకోక అతణ్ణి ఖైదునుంచి విడుదల చేశాడు. తాను భద్రపాలుడికి ఆశ చూపిన మంత్రిపదవి యివ్వలేదు. పరస్పర విరుద్ధమైన విక్రమవర్మ, సమర సేనుల ప్రవర్తన నా కర్థం కావడంలేదు. వారు ప్రతిసారీ తమ మనసు ఎందుకు మార్చుకున్నారు ? ఈ సందేహాలకు సమా ధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విక్రమ వర్మ, సమరసేనుల ప్రవర్తన హేతు విరుద్ధమైనదేం కాదు. యుద్ధంలో గెలు పోటములు ఎవరివైనా, ప్రజాక్షయం కలుగుతుందని, సమరసేనుడు మొదట యుద్ధాన్ని వ్యతిరేకించాడు. ఆనందవర్మ మరణానంతరం అతడు సంధికి వ్యతిరే కించడం కూడా ప్రజల క్షేమం కోరే. విజయగర్వంతో విక్రమవర్మ ప్రజలను హింసలపాలు చేస్తాడేమో అన్న భయం అతడికున్నది. విక్రమవర్మ తనకు ఉరి శిక్ష విధించినట్టు చెప్పినప్పుడు కూడా, తన ఆఖరికోరికగా ప్రజలను న్యాయంగా పాలించమని అతడికి విన్నవించు కున్నాడు. అతడి పరిపాలన న్యాయసమ్మ తంగా, ప్రజాహితంగా వున్నదని తెలిశాక, అతడి వద్ద ఏ ఉద్యోగం చేయడానికైనా సిద్ధపడ్డాడు.

''పోతే, విక్రమవర్మ సహజంగానే ప్రజలక్షేమం కోరే పరిపాలకుడు. ఉరి శిక్ష వేసినట్టు చెప్పినప్పుడు సమరసేనుడు తన ఆఖరికోరికగా అన్నమాటల ద్వారా, అతడు కపటి కాదనీ, విశ్వాసపాత్రుడనీ విక్రమవర్మ గ్రహించాడు. ఆ కారణం గానే, సమరసేనుడు తన దగ్గిరకు ఉద్యోగం చేస్తానంటూ వచ్చినప్పుడు, తన ప్రధాన సలహాదారుగా నియమించు కున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# రాజదర్శనం

కౌశాంబీనగరంలో విఠలు డనే పండితుడైన బ్రాహ్మణుడుండేవాడు. అతడికి సరస్వతీ కటాక్షమైతే కలిగింది గాని, లక్ష్మీకటాక్షం లభ్యమైంది కాదు. పేదతనానికి తోడు అతడి పాండిత్యానికూడా గుర్తింపు లేకుండా పోయింది.

విఠలుడు తన భార్యాబిడ్డల్ని పస్తులుంచలేక, రాజుగారి దర్శనం చేసుకుని, తన విద్యాపాటవం ప్రదర్శించి, ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవాలనే ఉద్దేశంతో, రాజధానికి బయలుదేరాడు.

అయితే, ఆ సమయంలో కౌశాంబీ రాజోద్యోగుల్లో లంచగొండితనం ప్రబలంగా వున్నది. చిన్న పనికైనాసరే వాళ్లు లంచం యివ్వందే ముందుకు కదలనివ్వరు. కొన్ని కొన్ని పనులకు లంచం ఎంత యివ్వవలసి వుంటుందో వాళ్లు నిర్ణయించేశారు కూడా.

విఠలుడికి యీ సంగతులేవీ తెలియవు. అతను సరాసరి ద్వారపాలకుడి వద్దకు పోయి, రాజదర్శనానికి పోతున్నట్టు చెప్పాడు.

ద్వారపాలకుడు చేయిచాచి, "ముందు నా మామూలు యిచ్చిపో! లోపల ఇంకా నాలుగు 'ద్వారాలున్నాయి. అక్కడి వాళ్లకూడా మామూలు యిచ్చుకోవలసి వుంటుంది," అన్నాడు.

విఠలుడు విస్తుపోయి, "రాజదర్శనానికి మామూళ్ళ పేరుతో, యీ లంచాలేమిటి? సరాసరిపోయి ప్రభువులవారిని మేము దర్శించుకోకూడదా?" అని అడిగాడు.

"అట్టే మాట్లాడక, డబ్బు తెచ్చి వుంటే యిచ్చి కదులు. లేదూ, వచ్చిన దారినే పో!" అని కసురుకున్నాడు ద్వారపాలకుడు.

బొమ్మిడి అచ్చారావు

విఠలుడికి కన్నీళ్ళపర్యంతమైంది. ఇవ్వటానికి అతని దగ్గిర చిల్లిగవ్వ లేదు. ద్వారపాలకులకు డబ్బిస్తేనే గాని రాజ దర్శనం కాదు! దిగులు ముఖంతో వెనక్కు తిరిగిపోతున్న అతనికి హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది.

అతను రాచబాటలో నిలబడి వచ్చే పోయేవాళ్లతో, రాజును నిందిస్తూ మాట్లాడ సాగాడు:

"వినండి! మన మహారాజు ధర్మ ప్రభువనుకుంటున్నారేమో, కాదు – ఒట్టి అధర్మపరుడు! అసలు, యీ రాజు గద్దె ఎక్కడానికి అర్హుడు కాదు. రాజు అనే కంటే, ఈయన్ని చింతపండూ, మిరప కాయలూ తూచే తరాజనటం న్యాయంగా వుంటుంది."

చుట్టూ చేరిన జనం విఠలుణ్ణి పిచ్చి వాడనుకున్నారు. రాజభటులు వచ్చి, అతణ్ణి రాజద్రోహి అంటూ పెడరెక్కలు విరిచికట్టి తీసుకుపోయి, రాజుముందు నిలబెట్టారు.

"ఓయ్, పొగరుబోతా! రాజదూష ణకు శిక్ష ఏమిటో తెలుసా?" అన్నాడు రాజు కళ్ళెర్ర చేసి.

విఠలుడు ఆయనకు తల వంచి నమస్కరించి, "మహాప్రభూ! తమను దూషిస్తేగాని దర్శనం లభించనప్పుడు, యిక చేయగలిగిందేముంది? దూషించక తప్పదుగదా!" అన్నాడు.

"నువ్వనేదేమిటి?" అంటూ రాజు గద్దించాడు.

"ఏలినవారు మన్నించాలి. నేను పేద వాణ్ణి; పండితుణ్ణి. తమ దర్శనం చేసుకో వాలని వస్తే, ద్వారపాలకులు లంచం అడిగారు. అందుకే రాజవీధిలో నిలబడి తమను దూషిస్తున్నట్టు నటించాను. వెంటనే తమ దర్శనభాగ్యం కలిగింది!" అన్నాడు విఠలుడు.

రాజు విచారించగా, ఉద్యోగుల అవి నీతి బయటపడింది. ఆయన వాళ్ళను కఠినంగా శిక్షించి, విఠలుడికి తన కొలు వులో మంచి పదవి యిచ్చాడు.





# ఇంటియిరుకు

గణపతి భార్యా, బిడ్డలతో పట్నంలో స్థిరపడిన తర్వాత, అక్కడే ఒక మూడు గదుల ఇల్లు కట్టుకున్నాడు. ఇంట్లో అన్ని సదుపాయాలూ ఏర్పరచుకున్నాడు. ఉండటానికున్న మూడు గదులూ కాక, ఒక వంటగదీ, స్నానాలగదీ వున్నవి.

గణపతి స్నేహితుడు వెంకటేశం పట్నం వచ్చాడు. అక్కడ అతడికి చిన్న ఉద్యోగం ఒకటి దొరికింది. అతను గణపతి ఇంటికి వెళ్ళి, "పట్నంలో ఇళ్ళ అద్దెలు విపరీతంగా పెరిగిపోయినై, నాకు వచ్చే జీతం తక్కువ. నువు సరేనంటే నేనూ, నా భార్య రాధా కొంతకాలంపాటు మీ ఇంటనే వుంటాం," అన్నాడు.

గణపతి భార్యతో సంప్రతించాడు. ఆమె ఇల్లు యిరుకైపోతుందేమో అన్నది. వాళ్ళను కొన్నాళ్ళుండమని, ఇల్లు మరీ అంత ఇరుగ్గా తయారైతే, అప్పుడే మరొక ఇల్లు చూసుకోమని చెప్పవచ్చున్నాడు గణపతి. ఆ విధంగా వెంకటేశం గణపతి ఇంట్లో ప్రవేశించాడు.

గణపతిదీ, అతడి భార్యాబిడ్డలదీ కూడా చాలా కలుపుగోలు స్వభావం. కాని, వెంకటేశం, అతడిభార్య రాధా యిందుకు పూర్తిగా భిన్నం. వాళ్ళిద్దరూ ఒక గదిలో వుండేవారు. అస్తమానమూ ఏవో కబుర్లాడుతూండేవాళ్ళు. వెంకటేశం, రోజులో ఒకసారి గణపతిని ముక్తసరిగా పలకరించేవాడు. రాధ తన వంట తాను చేసుకునేది. ఆమె కొన్న పప్పులూ వగైరా దాచటానికి గణపతిభార్య వంటింట్లో ఒక అర ఖాళీ చేయవలసి వచ్చింది.

క్రమంగా గణపతి కుటుంబానికి ఇల్లు యిరుకైనట్లు అనిపించసాగింది.

గణపతి భార్యతో ఏం మాట్లాడాలన్నా, అవి వెంకటేశానికి వినబడతాయేమోనన్న

"వసుంధర"



భయంతో వూరుకునేవాడు. ఎప్పుడైనా కొంతసేపు వెంకటేశం, భార్యా కలిసి ఎక్కడికైనా బయలుదేరి వెళితే, ఇంటిల్లపాదీ ఆ కాసేపూ హాయిగా కబుర్లు చెప్పుకునేవారు.

ఇలా కొద్దినెలలు గడిచాక ఒకరోజున వెంకటేశం తను వెళ్ళిపోతానని గణపతికి చెప్పాడు. వెంకటేశం వెళ్ళిపోతే బావుండునని గణపతికి చాలా కాలంగా వున్నది. అతడు మనసులో సంతోషపడిపోతూనే పైకి మర్యాదకోసం, "ఉన్నట్టుండి ఎక్కడికి వెళ్ళిపోతావు? కాస్త చౌక అద్దెలో మంచి ఇల్లు దొరికాక వెళుదువుగాని," అన్నాడు.

"ఇంటి కోసం చాలా రోజుల్నుంచి వెతుకుతున్నాను. ఇప్పటిగ్గాని చౌకలో ఇల్లు దొరికిందికాదు. ఈ మధ్య నా జీతం కూడా కాస్త పెరిగింది. ఇవన్నీ కలసిరాబట్టే వెళ్ళడం జరుగుతున్నది," అన్నాడు వెంకటేశం.

ఆ రోజే వెంకటేశం భార్యతో ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు ఆ దంపతులు గణపతిని మాటవరసకైనా తమ కొత్త ఇంటికి వీలైనప్పుడు రమ్మని ఆహ్వానించలేదు.

ఇంటికోసం వెతకడంలో వెంకటేశం తన సాయం కోరనందుకు గణపతి బాధపడ్డాడు. ఇల్లు చూడ్డానికి రమ్మనలేదని గణపతి భార్య నొచ్చుకున్నది. ఏమైతేనేం, వాళ్ళకిప్పుడు ఇల్లు విశాలంగా వుండి హాయనిపించసాగింది.

ఈలోగా అదే పట్నం గణపతి మరొక స్నేహితుడు మంగయ్య వచ్చాడు. అతడికి భార్యా, నలుగురు పిల్లలు. వస్తూనే మంగయ్య గణపతి ఇంట్లో మకాం పెట్టి, "నే నిక్కడ మూడు సంవత్సరాలుంటాను. నీకు గుర్తున్నదో లేదో, మనం కలుసుకుని ఎంతో కాలం అయింది. కాబట్టి ఒక ఆరుమాసాలు నీ ఇంట్లో వుంటాను. నువ్వు వద్దన్నా మానను!" అన్నాడు.

గణపతి ఏమీ మాట్లాడలేదు. అతడి భార్య మాత్రం, "ఆ వెళ్ళిపోయిన భార్యా భర్తలిద్దరుంటేనే మనకు ఇల్లు యిరుకైంది. ఇప్పుడీయన నలుగురు పిల్లలతో దిగాడు. అంత్యనిష్ఠూరం కంటే, ఆది నిష్ఠూరం మేలన్నారు! ముందే కుదరదని చెప్పేయండి," అన్నది భర్తతో.

"అతను ఇంట్లో చేరేందుకు నా అనుమతి అడిగివుంటే అలాగే చేద్దును. తనే వుంటానని మొరాయించుకు కూర్చుంటే, నేనేం చేసేది? ఒక వారం గడిస్తే, ఇల్లెంత ఇరుకో వాళ్ళకే తెలుస్తుందిలే. అలా తెలిసిరాకపోతే, అప్పుడే చెప్పొచ్చు," అన్నాడు గణపతి.

అతడు యిలాంటి విషయాల్లో చాలా మొహమాటం మనిషి.

ఇక కొద్దిమాసాల పాటు వీళ్ళ బాధ తప్పదనుకున్నది గణపతి భార్య. ఆమె వంటింటి గూట్లో ఒక అర ఖాళీచేసి మంగయ్య భార్యతో, "వదినా, యీ అర నువ్వు వాడుకో," అన్నది.

మంగయ్యభార్య ఆశ్చర్యపోతూ, "నాకు వేరే అర ఎందుకమ్మా, మనం కలిసే వుంటాం గదా," అన్నది.

ఆ సమయంలో మంగయ్య అక్కడికి వచ్చి, గణపతిని కూడా పిలిచి, "ఒరే, నువ్వు అట్టే మొహమాటాలకు పోకు,



మనం అన్నింట్లోనూ కలిసి వుందాం. కలిసి వంట చేసుకుందాం, అయిన ఖర్చు సమంగా భరిద్దాం," అన్నాడు.

గణపతి ఆ మాటలకు ఆశ్చర్యపోయి, అప్రయత్నంగా తల వూపేశాడు. రోజూ మంగయ్య భార్యా, గణపతి భార్యా ఒకరికొకరు తోడుగా వుండి వంటా, ఇంటిపనులన్నీ చేసుకునేవారు.

మంగయ్య పిల్లలూ, గణపతి పిల్లలూ ఎంతో స్నేహంగా వుండేవారు. తెలియక వాళ్ళెప్పుడైనా దెబ్బలాడుకుంటే, మంగయ్య ఎంతో తెలివిగా వాళ్ళ గొడవలు పరిష్కరించేవాడు. ప్రతిరాత్రీ మంగయ్య వాళ్ళను ఒకచోటచేర్చి కథలు చెప్పేవాడు.

మంగయ్య తన సమస్యలూ, కష్ట సుఖాలూ గణపతికి చెప్పుకుని సలహా లడిగే వాడు; గణపతి కష్టసుఖాలడిగి తెలుసుకుని తనకు తోచిన సలహాలిచ్చే వాడు. ఇంట్లో ఏ వేడుక జరిగినా, అంతా కలిసి వినోదించేవారు. ఎవరి పిల్లల పుట్టినరోజు వచ్చినా ఇంటిల్లపాదీ పండగ జరుపుకునే వారు. ఆ ఇల్లు తమది అనీ, అందులో మంగయ్య కుటుంబం పరాయి దనీ, గణపతి కుటుంబం మరిచేపోయింది.

ఇలా ఆరునెల్లు గడిచాక ఒకరోజున మంగయ్య గణపతితో, "ఒరేయ్, ఇట్టే ఆర్నెల్లు గడిచిపోయాయి. ఇంతకాలం రోజులు సరదాగా గడిపేశాం. ఇంకా ఎన్నాళ్ళని మీ ఇంట్లో వుండేది? ఎక్కడైనా ఓ మంచి ఇల్లు చూసిపెట్టు," అన్నాడు.

"ఈ పట్నంలో వున్నన్నాళ్ళూ నువ్వు, మా ఇల్లు వదలడానికి వీల్లేదు. అసలు నువ్వీ పట్నం వదలడమైనా కిష్టంలేదు," అన్నాడు గణపతి.

"అలాగంటే ఎలా? చెల్లమ్మా, నువే చెప్పు. మేము వుండడం వల్ల మీకు ఇల్లు యిరుకై పోలేదూ?" అన్నాడు మంగయ్య, గణపతి భార్యవంక చూస్తూ.

"ఏమో అన్నయ్యా! లోగడ వెంకటేశం అన్నాయన పెళ్ళాంతోపాటు యిక్కడుండేవాడు. వాళ్ళిద్దరుంటేనే ఇల్లు ఎంతో యిరుకనిపించింది. కాని, మీరు యింతమంది వున్నా ఇల్లు యిరుకనిపించడంలేదు సరికదా, ఇంటికి మీరే నిండు అనిపిస్తున్నది. మీరు వెళితే ఇల్లు చిన్నబోతుంది. మీరు వెళ్ళడానికి నే నొప్పను," అన్నది గణపతి భార్య.

మంగయ్య సొంతఇల్లు కట్టుకునేవరకూ గణపతి ఇంట్లోనే వుండిపోయాడు.

"ఇల్లు యిరుకవడం, ఇంటి వైశాల్యం మీద ఆధారపడదు. అందులో వుండే మనుషులే దాన్ని యిరుకుగానూ, విశాలంగానూ మార్చగలరన్న గొప్ప సత్యాన్ని గణపతి యీ అనుభవం ద్వారా తెలుసుకున్నాడు.






మగధరాజ్యం ఉచ్ఛస్థితిలో వున్న కాలంలో బోధిసత్వుడు ఒకప్పుడు ఆ రాజు వద్ద కోశాధికారిగా వుండేవాడు. అయనకు ఎనభైకోట్ల వరహాల సొంత ఆస్తి వుండేది.

కాశీరాజ్యంలో శ్రీవత్స అనే మరొక ధనవంతు డుండేవాడు. ఆయనా ఎనభై కోట్ల వరహాలకు పైబడిన ఆస్తిపరుడు. కోటీశ్వరులైన బోధిసత్వుడూ, శ్రీవత్సా ప్రాణమిత్రులు.

కాలం కలిసిరాక, వ్యాపారంలో విపరీతంగా నష్టపోవడంతో శ్రీవత్స పేదవాడై పోయాడు. ఆ పరిస్థితుల్లో అతడికి తన మిత్రుడైన బోధిసత్వుడు గుర్తుకు వచ్చాడు.

శ్రీవత్స తన భార్యతో కాలినడకన బయలుదేరి మగధరాజ్యం చేరి, బోధిసత్వుణ్ణి చూడబోయాడు.

బోధిసత్వుడు ఆయనకు ఎదురు వెళ్ళి కుశల ప్రశ్నలు అడిగాడు. శ్రీవత్స పెద్దగా నిట్టూరుస్తూ, "బోధిసత్వా! నా దశ మారిపోయింది. బికారినైపోయాను. ఇటువంటి స్థితిలో నాకు సహాయపడగలవాడివి నీవు ఒక్కడివే అని నమ్మి, యిలా వచ్చాను," అన్నాడు.

"శ్రీవత్సా, విచారించకు. కష్టసమయంలో రావలసిన చోటుకే వచ్చావు," అని బోధిసత్వుడు తన దగ్గిర వున్న ధనంలో సగం—నలభైకోట్ల వరహాలు మిత్రుడికివ్వడమే కాక, దానితో పాటు తన పరివారంలోని సగంమందిని అతడి పరం చేశాడు.

కొంతకాలం గడిచింది. రాజ్యంలో చెలరేగిన అరాజకం, అల్లరుల కారణంగా బోధిసత్వుడు ఉద్యోగంతోపాటు ధనాన్ని కూడా పోగొట్టుకుని, దారిద్ర్యబాధకు

గురయ్యాడు. ఆయనకు యీ స్థితిలో తనకు సాయపడగలవాడు మిత్రుడైన శ్రీవత్స తప్ప మరెవరూ లేరన్న నమ్మకం కలిగింది. వెంటనే బోధిసత్వుడు భార్యతో సంగతి చెప్పి, ఆమెతో సహా కాశీరాజ్యానికి బయలుదేరాడు.

ఆయన నగర సరిహద్దులు చేరుతూనే భార్యను ఒక చెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటూ వుండమని చెప్పి, "నువ్వేమీ అదుర్దాపడకు. ప్రాణమిత్రుడైన శ్రీవత్సకు సంగతి చెప్పి, నీ కోసం బండినీ, పరిచారకులనూ పంపుతాను," అని నగరంలోకి వెళ్ళాడు.

బోధిసత్వుడు, శ్రీవత్స వుండే భవన ద్వారం కాపలావాడితో తాను ఎవరైనదీ చెప్పి, ఆ సంగతి యజమానికి చెప్పమన్నాడు.

కాపలావాడు లోపలికి పోయి తిరిగి వచ్చి, బోధిసత్వుణ్ణి తన యజమాని రమ్మనమని చెప్పినట్టు తెలియపరిచాడు.

శ్రీవత్స, బోధిసత్వుణ్ణి ఎగాదిగా చూసి, "ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు విసుగుపడుతున్నట్టు.

"మీ దర్శనం కోసం...." అంటూ బోధిసత్వుడు తల దించుకున్నాడు.

"బస ఎక్కడ చేశావు?" అన్నాడు శ్రీవత్స.

"ఇంకా బస కుదుర్చుకో లేదు. నా భార్యను పొలిమేర దగ్గిర వదిలి, యిలా వచ్చాను," అన్నాడు బోధిసత్వుడు.



"నా ఇంట బస దొరకదు! చారెడు గింజలు యిస్తాం, పట్టుకుపోయి గంజి కాచుకుతాగు," అన్నాడు శ్రీవత్స కఠినంగా.

ఆ మరుక్షణం ఒక సేవకుడు దోసెడు గింజలు తెచ్చి బోధిసత్వుడి ఒడిలో పోశాడు. బోధిసత్వుడు తన భార్య వున్న చోటుకు వెళ్ళాడు.

"మీప్రాణస్నేహితుడు ఏమిచ్చాడు?" అని భార్య అడిగింది.

"మిత్రుడు శ్రీవత్స చారెడు గింజలతో మన పీడ వదుల్చుకున్నాడు," అన్నాడు బోధిసత్వుడు నిర్వికారంగా.

"అవెందుకు పుచ్చుకున్నారండీ? మనం అతడికిచ్చిన నలభైకోట్ల వరహాలకు యిది ప్రతిఫలమా? ఇలాంటి కృతఘ్నుడి ముఖం చూడటమే, పాపం!" అన్నది భార్య కోపంగా.

కళ్ళ నీళ్ళు పెట్టుకున్న భార్యను ఓదార్చుతూ బోధిసత్వుడు, "ఏది ఏమైనప్పటికీ, ఒకసారి మిత్రులైన వారిమధ్య విరోధభావం ఏర్పడకూడదు. అందుకోసమే, యీ గింజలు పుచ్చుకున్నాను," అన్నాడు.

భార్యా, భర్తలు యిలా మాట్లాడుకుంటూ వుండగానే సేవకుడొకడు ఆ దారినే వచ్చాడు. వాడు లోగడ బోధిసత్వుడు శ్రీవత్సకు పంచి యిచ్చిన పరివారంలోనివాడు. వాడు తన పూర్వపు యజమానిని గుర్తించి, కాళ్ళపైబడి,



"అయ్యా, యిలా వచ్చారేం?" అని అడిగాడు.

బోధిసత్వుడు వాడికి జరిగినదంతా చెప్పాడు.

సేవకుడు ఎంతగానో విచారించి, బోధిసత్వుణ్ణీ, ఆయన భార్యనూ తన ఇంటికి తీసుకుపోయి, భోజనం పెట్టి, ఉండేందుకు ఒక గది యిచ్చాడు. వాడు ఆ తరవాత యీ సంగతి తనతోడి సేవకులందరికీ చెప్పాడు.

క్రమంగా కోటీశ్వరుడైన శ్రీవత్స మిత్రద్రోహం సంగతి కాశీరాజుకు తెలిసింది. ఆయన బోధిసత్వుణ్ణి పిలిపించి, "నీవు శ్రీవత్సకు నలభైకోట్ల వరహాలు యిచ్చిన సంగతి నిజమేనా?" అని అడిగాడు.

బోధిసత్వుడు రాజుకు అంతా వివరించాడు. రాజు శ్రీవత్సకు కబురు చేసి, అతడికి బోధిసత్వుణ్ణి చూపుతూ, "ఈయన నుంచి నువు లోగడ ధనసహాయం పొందిన మాట నిజమేనా?" అని ప్రశ్నించాడు.

"నిజమే, మహారాజా!" అన్నాడు శ్రీవత్స బిక్కచచ్చిపోతూ.

"అయితే, ఆ సహాయానికి బదులు నీ మిత్రుడికి ఎలాంటి ఆదరణ చూపావు?" అన్నాడు రాజు.

శ్రీవత్స సిగ్గుతో, అవమానంతో తల వంచుకున్నాడు.

రాజు, తన మంత్రులతో సంప్రతించి, శ్రీవత్స ఆస్తి అంతా బోధిసత్వుడి పరం చేస్తున్నట్టు తీర్పు యిచ్చాడు.

బోధిసత్వుడు రాజుతో, "మహారాజా, ఇతరుల సొత్తు నాకు పూచికపుల్ల కూడా వద్దు. నేను యిచ్చినది నాకు తిరిగి యిస్తే, అంతేచాలు!" అన్నాడు.

రాజు ఆ ప్రకారమే బోధిసత్వుడికి నలభైకోట్ల వరహాలు శ్రీవత్స చేత యిప్పించి, బోధిసత్వుడితో, "అపాత్ర దానం కూడని పని!" అన్నాడు.

ఈ విధంగా బోధిసత్వుడు తిరిగి ఐశ్వర్యవంతుడై, దానధర్మాలు చేస్తూ చాలా కాలం సుఖంగా జీవించాడు.






# యువాన్ చ్వాంగ్ యాత్రలు - 1

చైనాదేశంలో క్రీ. శ. ఏడవ శతాబ్దంనాటి సంఘటన. పధ్నాలుగు మంది యువ భిక్షువులను ప్రభుత్వం ఎన్నిక చేసింది. వారిలో యువాన్ చ్వాంగ్ ఒకడు. అప్పటికి అతడు పన్నెండేళ్ళ ప్రాయంవాడు.

పెరుగుతున్న వయసుతో పాటు యువాన్ చ్వాంగ్‌లో జ్ఞానతృష్ణ అధికంకాసాగింది. బౌద్ధధర్మాన్ని గురించి తన దేశభిక్షువులు ఉపదేశించే ధోరణి అతడికి నచ్చేది కాదు. యువాన్ భారతదేశాన్ని సందర్శించేందుకు చక్రవర్తి అనుమతి కోరాడు. ఆయన అందుకు నిరాకరించాడు. అయినా, యువాన్ బయలుదేరి సరిహద్దు కాపలావాళ్ళకు దొరికిపోయాడు.





అతడు కాపలావాళ్ళకు తాను చేయ తలపెట్టిన భారతయాత్ర గురించి దాచకుండా చెప్పేశాడు. వాళ్ళు, యువాన్ నిజాయితీని మెచ్చుకుని, విడిచిపుచ్చారు. ఒక వృద్ధుడు అతడికి ఒక ముసలి గుర్రాన్ని బహూకరించాడు. ఒక బౌద్ధమతస్థుడు యువాన్‌కు మార్గదర్శిగా వుండేందుకు ఒప్పుకుని, కష్టసాధ్యమైన కొండకనుమ మార్గంలో భయపడి వెనుదిరిగిపోయాడు.



భయంకరమైన ఇసుక ఎడారుల వెంట యువాన్ జంతు, మానవ అస్తిపంజరాలే మార్గదర్శకాలుగా చేసుకుని ప్రయాణం సాగించాడు. ఒకనాడు అతడు దాహబాధతో స్పృహకోల్పోయే స్థితిలో వుండగా, ముసలిగుర్రం అతణ్ణి ఎడారిలో ఒక నీటిమడుగు వద్దకు చేర్చింది.

యువాన్ దప్పిక తీర్చుకుని, తిరిగి ప్రయాణం సాగించి తుర్‌ఫాన్ అన్న జననివాన ప్రాంతాన్ని చేరాడు. ఆ ప్రాంతాన్నేలే రాజు యువాన్ చ్వాంగ్‌ను ఎంతగానో సత్కరించి, అతడి పాండిత్య ప్రతిభకు పరవశుడై, తన గురువుగా చేసుకున్నాడు. కాని, కొన్నాళ్ళ తర్వాత యువాన్ తిరిగి ప్రయాణ ప్రయత్నాలు ప్రారంభించేసరికి రాజు అందుకు అభ్యంతరం చెప్పాడు.





చేసేది లేక యువాన్ నిరశనవ్రతం ప్రారంభించాడు. తన అనుమతి నిరాకరణ గురువు మరణానికి కారణం అవుతుందని గ్రహించిన రాజు యువాన్ ప్రయాణానికి అనుమతించి, అంగరక్షకులుగా కొందరు భటులను వెంట పంపాడు. భటులు అతణ్ణి భారత సరిహద్దులు చేర్చి, వెనుదిరిగిపోయారు.



ఈ విధంగా యువాన్ చ్వాంగ్ భారత దేశం చేరాడు. నగరహర ప్రాంతం లోని ఒక కొండగుహలో బుద్ధుడి ఛాయ శాశ్వతంగా భద్రపరచబడిందనే ప్రశస్తి వున్నది. యువాన్ ఆ గుహచేరి, ధ్యాన మగ్నుడై తేజోమయుడైన బుద్ధ సాక్షాత్కారం పొందాడు.

తరవాత అతడు ప్రయాగక్షేత్రానికి పడవలో ప్రయాణం చేస్తుండగా, బంది పోటు దొంగలు అతణ్ణి పట్టుకుని, యువాన్ సర్వలక్షణ శోభితుడుగా కని పించడంతో, తమ దేవతకు బలిపెట్ట తగిన వాడని భావించి, తీసుకుపో సాగారు. అతడి వెంట వున్న వాళ్ళు నిస్సహాయులుగా చూస్తూ వూరు కున్నారు.





బందిపోటు దొంగలు యువాన్‌చ్వాం గును బలి యిచ్చేందుకు తమ దేవత విగ్రహం ముందుకు లాక్కుపోయారు. రాబోయే జన్మలో అయినా తాను తల పెట్టిన కార్యం నెరవేర్చుకోగల శక్తిని యివ్వవలసిందిగా అతడు బుద్ధుణ్ణి ప్రార్థించాడు. తరవాత అతడు బంది పోటు దొంగలతో, తాను బలి అయేం దుకు సిద్ధంగా వున్నట్టు చెప్పాడు.



ఆ మరుక్షణం పెనుతుఫాను ప్రారంభమైంది. చుట్టూవున్న చెట్టుచేమలు ఫెళ ఫెళా రావాలతో కూకటివేళ్ళతో సహా కూలిపోసాగినై. ఆ సమయంలో యువాన్ చ్వాంగ్ తోటి ప్రయాణీకుడొకడు, దొంగలతో, యీ మహనీయుణ్ణి బలిచేస్తే, మీరు సర్వనాశనం అయిపోగలరని చెప్పాడు.

దొంగలు యువాన్ చ్వాంగ్‌ను వదిలి అతడి పాదాలముందు మోకరిల్లారు. యువాన్ దొంగలతో, "మీరు చేసే పాప కృత్యాలకు ప్రతిఫలంగా ఏదో ఒకనాడు భయంకరమైన శిక్షపొంది తీరుతారు. మీరు ఇతరులను గురిచేసేలాంటి హింసలకు, మీరూ ఒకనాడు తప్పక గురి అవుతారు," అన్నాడు.





యువాన్ చ్వాంగ్ ఆదేశం వింటూనే దొంగలు తమ ఆయుధాలను గంగా నదిలో పారవేశారు. ఇక ముందు సాధుజీవనం గడపగలమని మాట ఇచ్చారు. యువాన్ వాళ్ళను దీవించి, ప్రయాణం సాగించాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)

# మామను మించిన అల్లుడు

ఒకనాడు ప్రదీపుడు అనే యువకుడు మంత్రి వద్దకు వచ్చి, రాజుగారి వద్ద నౌకరీ ఇప్పించ మన్నాడు.

"సులక్షణు డనేవాడు నా సహాయంతో రాజుగారి సేవకుడుగా చేరి, ఇవాళ రాజుగారి అంతరంగికుడు అయాడు. నువు రహస్యంగా వాణ్ణి చంపేస్తే నీకు రాజుగారి వద్ద ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నాడు మంత్రి.

మంత్రి చెప్పినట్టే చేసి ప్రదీపుడు రాజుగారి కొలువులో చేరాడు. వాడు ఒకసారి వేటలో వున్న రాజును ప్రాణాపాయం నుంచి తప్పించాడు. మరొకసారి యుద్ధంలో రాజు ప్రాణాన్ని కాపాడటమే గాక, రాజుగారికి విజయాన్నే చేకూర్చాడు.

రాజు ప్రదీపుడి సేవలకు తన్మయుడై పోయి, కోరినది ఇస్తానన్నాడు. తనకు మంత్రి కుమార్తెను ఇచ్చి పెళ్ళి చెయ్యమన్నాడు ప్రదీపుడు.

ప్రదీపుడికి మంత్రి కూతురితో పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళి పీటల మీద కూర్చో బోతున్న ప్రదీపుడితో మంత్రి, "అల్లుడూ, రాజు కూతురు నా కూతురు కన్న బాగుంటుంది గదా, ఆమెనే ఇయ్యమనకపోయావా? రాజు ఇయ్యడని భయపడ్డావా?" అన్నాడు.

"అది కాదులెండి. సులక్షణుడి గతే నాకూ పట్టకుండా జాగ్రత్తపడ్డాను," అన్నాడు ప్రదీపుడు.

—శరత్







# ఎలా గెలిచాడు?

అశ్వరాజ్య యువరాణి మాధవికి యుద్ధ విద్యలంటే చాలా యిష్టం. ఒక్కతే కూతురు కావడంవల్ల, మహారాజు శౌర్య వర్మ ఆమెకు, ఆనందయోగి అనే పండితుడి వద్ద తర్కం, గణితశాస్త్రాలతో పాటు, విడిగా కత్తి యుద్ధం, గుర్రపు స్వారి లాంటివి కూడా నేర్పించాడు.

అశ్వరాజ్య సేనాధిపతి పేరు ఇంద్రజిత్తు. అతడు ఏదో జబ్బుతో హఠాత్తుగా చనిపోవడంతో, ఆ పదవికి తగిన వ్యక్తిని ఎన్నిక చేయవలసిన అవసరం కలిగింది. అందుకు రాజు పోటీ ఏర్పాటు చేశాడు.

పోటీలో పాల్గొనేందుకు అనేకమంది వీరులూ, యోధానయోధులైన యువకులూ వచ్చారు. వారందరిలోనూ రవీంద్రుడు, మురారి, ఫణీంద్రుడు అనే ముగ్గురు యువకులు అమితమైన ధైర్య సాహసాలు ప్రదర్శించి, ప్రేక్షకులందరి ప్రశంసలూ పొందారు. వారి మధ్య కత్తి యుద్ధం పోటీ ఏర్పాటయింది.

ఈ పోటీలో రవీంద్రుడు, మురారి చేతిలో ఓడిపోయాడు. ఒకగంట విరామం తరవాత తిరిగి మురారి, ఫణీంద్రుల మధ్య కత్తి యుద్ధం పోటీ ఏర్పాటయింది. ఈసారి మురారి, ఫణీంద్రుడి చేత ఓడింపబడ్డాడు.

రాజు ప్రేక్షకులందరినీ ఉద్దేశించి, "ఈరోజు పోటీలో రవీంద్రుడు, మురారి, ఫణీంద్రుడు తమ ప్రతిభను చక్కగా ప్రదర్శించారు. ఫణీంద్రుడు అందరినీ గెలిచాడు. అందువల్ల...." అని, యింకా ఏదో చెప్పబోతున్నంతలో, పక్కనే కూర్చుని వున్న రాకుమారి లేచి, "నాన్నగారూ, కొంచెం ఆగండి!" అన్నది.

రాజుతోపాటు, ప్రేక్షకులందరూ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశారు. రాకుమారి

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

మాధవి ప్రేక్షకులతో, "మహారాజుగారు చెప్పినట్టు, ఫణీంద్రుడు గొప్ప ప్రతిభావంతుడే! కాని, మురారి, రవీంద్రుడు కూడా అద్భుతమైన ప్రజ్ఞప్రదర్శించారు. అసలు సంగతేమంటే, ఫణీంద్రుడు, మురారిని గెలిచాడు కాని, రవీంద్రుడిని గెలవలేదు. అందుచేత రేపు మళ్ళీ మురారి, రవీంద్రులకు మరొక అవకాశం యిప్పించవలసి వుంటుంది," అన్నది.

రాజు, తన కుమార్తె చెప్పినదాన్ని ఆమోదించాడు. మరసటిరోజున రవీంద్రుడు, ఫణీంద్రుల మధ్య కత్తియుద్ధం పోటీ జరిగింది. ఫణీంద్రుడు గెలుస్తాడనుకున్న వాళ్ళందరికీ ఆశ్చర్యం కలిగేలా, రవీంద్రుడు ఫణీంద్రుణ్ణి ఓడించాడు. ఒక గంట విశ్రాంతి తరవాత మళ్ళీ రవీంద్రుడు, మురారిల మధ్య పోటీ జరిగింది. ఇందులో రవీంద్రుడు మురారిని ఓడించాడు.

ఇది చూసి రాజుకు మతిపోయినంత పనైంది. ఇప్పుడేం చెయ్యడం అన్నట్టు కుమార్తె కేసి చూశాడు.

"నిన్నటి ఫలితాన్ని బట్టి, యీ రోజు ఎన్నిక విషయం కొంత సందిగ్ధంలో పడింది. సంగతేమంటే, ఇవ్వాళ రవీంద్రుడు విడివిడిగా యిద్దరినీ గెలిచాడు. అతడు అత్యంత సమర్థుడని తెలుస్తూనే వున్నది. అయినా రేపు మరొకసారి ప్రత్యర్థులకు అవకాశం యివ్వడం మంచిది. ఆ పోటీలో గెలుపోటములను



బట్టి, సేనాపతి ఎన్నిక ధృవపరచవచ్చు.'' అన్నది మాధవి.

మూడవరోజు మళ్ళీ పోటీ ప్రారంభమైంది. మొదట ఫణీంద్ర, మురారుల మధ్య పోటీ జరిగింది. ఫణీంద్రుడు ఓడిపోయాడు. ఒక గంట విశ్రాంతి తరవాత మురారి, రవీంద్రుల మధ్య పోటీ ప్రారంభమైంది. ఇందులో మురారి ఓడిపోయాడు. రాజు వెంటనే రవీంద్రుణ్ణి సేనాపతిగా ఎన్నిక చేసినట్టు ప్రకటించాడు. అందరూ హర్షధ్వానాలు చేశారు.

ఆ సాయంకాలం రాజు కుమార్తెతో, ''మూడు రోజుల క్రితం కత్తియుద్ధం పోటీ ముగియగానే ఫణీంద్రుణ్ణి సేనాపతిగా ప్రకటిద్దామనుకున్నాను. కాని, నువ్వు యీ పోటీని మరి రెండు రోజులు పొడిగించావు. ఇందువల్ల రవీంద్రుడే ఉత్తమ వీరుడని తేలింది. అతను ఎలాగెలిచాడు? నీకు, యీ విధంగా పోటీని మూడుసార్లు జరిపించాలన్న ఆలోచన ఎందుకు వచ్చింది?'' అని అడిగాడు.

''నాన్నగారూ, మొదటిరోజు పోటీలు చూస్తున్నంతసేపూ, రవీంద్రుడిలో ఏదో ప్రత్యేకత వున్నట్టు తోచింది. కాని, నేను అనుకున్నట్టు కాకుండా అతడు కత్తియుద్ధంలో ఓడిపోయాడు. మిగిలిన ఇద్దరి తరవాత అతడు తన శక్తిని ప్రదర్శించవలసి రావడంతో, అలసిపోయి వుండాలి! వెంటనే నాకు మా గురువు ఆనందయోగి జ్ఞాపకం వచ్చారు. ఆయన, 'ఒక పరీక్షను బట్టి వ్యక్తి శక్తిసామర్థ్యాలను నిర్ణయించడం కంటే, ఎక్కువ పరీక్షల ద్వారా అసలు సత్తా తెలుసుకోవడం సరిఅయిన పద్ధతి,' అనేవారు. నేను అనుమానించినట్టే, మర్నాడు రవీంద్రుడు మిగతా యిద్దర్నీ జయించగలిగాడు,'' అన్నది మాధవి.

అత్యంత ముఖ్యమైన సేనాధిపతి ఎన్నిక విషయంలో, తన కుమార్తె కనబరిచిన వివేకం చూసి రాజు చాలా సంతోషించాడు. రవీంద్రుడు సేనాపతిగా, ఎంతో పేరుప్రఖ్యాతులు గడించాడు.



# తారుమారు

శ్రీపురంలో ఇద్దరు గొప్ప వ్యాపారస్థులు ఉండేవారు. వాళ్ళ ఇళ్ళు అనుకునే ఉండేవి. వారి భార్యలు సుశీలా, జానకి అనే వాళ్ళు, ఎంతో సఖ్యంగా ఉండేవాళ్ళు. ఒకసారి ఆ ఊళ్ళో అష్టలక్ష్మి ఆలయంలో ఉత్సవాలకు సుమతి అనే ఆమె వచ్చింది. ఆమెతో సుశీలకూ, జానకికీ స్నేహం కుదిరింది. వాళ్ళు ఆమెను తమ ఇళ్ళకు ఆహ్వానించారు. సుమతి వారి ఇళ్ళలో లక్ష్మి తాండవించటం చూసి, "నా భర్త కూడా భారీ ఎత్తున వర్తకం చేస్తాడు. అయినా మా ఇల్లు ఇంత సంపన్నంగా ఉండదు. ఎందుచేతనో?" అన్నది.

సుశీలకు దరిద్రదేవతను ఆవాహన చేసే మంత్రం వచ్చునట. దానితో ఆమె ఆ దేవతను ప్రత్యక్షం చేసుకుని, ఆమె తన ఇంటి చాయలకు రాకుండా వరం పొందింది. అలాగే జానకి లక్ష్మి మంత్రం జపించి, ఆ దేవిని ప్రత్యక్షం చేసుకుని, ఆమె తన ఇల్లు విడిచి పోకుండా వరం పొందింది.

సుమతి ఇద్దరి మంత్రాలూ నేర్చుకుని, వాటిని పునశ్చరణ చేసేసరికి, ఇద్దరు దేవతలూ ఒకేసారి ప్రత్యక్షమయారు. "నువు దరిద్ర దేవతవు. నన్ను ముందు వరం ఇయ్యనీ!" అంటూ లక్ష్మి ముందుకు వచ్చి, "నీకు ఏం కావాలి?" అని అడిగింది.

ఇద్దరు దేవతలూ ప్రకాశమానంగానే ఉన్నారు. సుమతికి తేడా తెలియక, "దేవీ, నువు నా యింటి చాయలకు ఎన్నడూ రాకు," అన్నది. లక్ష్మి సరేనని అదృశ్యమయింది. తరవాత సుమతి పెద్దమ్మను, "తల్లీ, నువు ఎన్నడూ నా యిల్లు వదలకు!" అని కోరింది.

వారం తిరిగేలోపల సుమతి భర్త వ్యాపారంలో సమస్తమూ కోల్పోయాడు. సుమతి దురాశకుపోయి ఇద్దరు విరుద్ధ దేవతలను ఆరాధించకపోతే ఇలా జరగదు!

—నల్లపాటి రామరాజు





# ప్రతిఫలం

రామయ్య ఒక తోటమాలి. ఒక రోజున అతను యజమాని తోటలో మొక్కలకు గుంట తవ్వుతున్నాడు. ఉన్నట్టే వుండి, వెనుకనుండి టకటకమని బూట్ల చప్పుడు వినిపించింది. చప్పున వెనక్కి తిరిగి చూచాడు రామయ్య. చూడగా, ఆయన ఎవరో ధనవంతుడిలాగా కనిపించాడు. ఆ కోటూ, బూటూ, టోపీ, కళ్ళజోడూ చూస్తే, ఆయన గొప్పవాడని వేషాన్నిబట్టే తెలుస్తున్నది. రామయ్య లేచి నించుని, ఆయనకు నమస్కరించాడు.

"అబ్బాయీ! తోటమాలి రామయ్య నీవేనా?" అని అడిగాడు ఆయన.

"అవునండి, బాబూ!" అన్నాడు రామయ్య.

"నీవు పదేళ్ళ క్రిందట యెవరి దగ్గర పని చేశావో, జ్ఞాపకముందా?" అని అడిగాడు ఆ కొత్తవాడు.

"అయ్యో, బాబూ, జ్ఞాపకం లేక పోవడం ఒకటా? ప్రభువులు సుబ్బరాజు గారి తోటలో మాలీగా ఉండేవాణ్ణిగదండీ. చల్లని మారాజు. వారి పేరు చెప్పితే అడవిలోకి పోయినా అన్నం పుడుతుంది. ఆయన కంటికి కనబడకుండా; ఎక్కడో విదేశాలకు వెళ్ళిపోయారు, బాబూ. లేక పోతే, ఈ జన్మలో వదులుతానా వారిని!" అంటూ తన మనసులో గల అభిమానమంతా వెల్లడించసాగాడు రామయ్య.

"అవును. వారక్కడ...." అని ఊరుకొన్నాడు ఆయన.

"అక్కడ ఏం జరిగింది? కులాసాగా ఉన్నారా, బాబూ?" అని ఆత్రంతో ప్రశ్నించాడు రామయ్య.

"అదే చెప్పబోయేది. పాపం, సుబ్బరాజుగారు అక్కడ కాలం చేశారు!" అన్నాడు కొత్తమనిషి.

ఈ మాటలు వింటూనే రామయ్య ఒక్కసారి గతుక్కుమని ఎంతగానో విలపించాడు.

కొంతసేపటికి రామయ్య తేరుకొని, "ఆహా, మా సుబ్బరాజుగారి వంటి మనిషి ఈ లోకంలోనే లేరు. ధర్మప్రభువు!" అంటూ యజమానిని పొగడటానికి ఆరంభించాడు. తరువాత ఆ వచ్చినాయనను, "బాబూ! వారు మీకు బంధువులా?" అని అడిగాడు రామయ్య.

అందుకాయన, "కాదు. నేను వారి వకీలును. రాజుగారు చనిపోయేముందు ఒక వీలునామా వ్రాశారు. అందులో మన వూరి పాఠశాలకూ, వైద్యశాలకూ, గ్రంథాలయానికీ–ఇంకా ఎన్నో సంస్థలకు ఆయన భూరివిరాళాలు ఇచ్చి వున్నారు," అని వర్తమానం చెప్పాడు.

తోటమాలి రామయ్య ఈ వార్త విని మనసారా ఆనందించాడు.

అటు తరువాత వకీలు తన కోటు జేబులోనించి ఒక సంచి తీసి, "అబ్బాయీ, రామయ్యా! ఇదుగో, దీనిని నీకు అందజేయమని నా ద్వారా రాజుగారు...." అని చెబుతూ, సంచి వానికిచ్చాడు. అది చూచీ చూడటంతోనే రామయ్య నివ్వెరపోయాడు. అది ఒక సీలు వేసిన సంచి. దానిని తెరవటం ఎలాగో సత్యకాలపు



రామయ్యకు తెలియనే లేదు. అందుకని, "బాబూ! ఇదేమిటో కాస్తంత చూచి పెట్టండి," అని వకీలుగారినే కోరాడు. ఆయన సీలు విప్పి, తెరిచి చూడగా అందులో రెండు వేల రూపాయలు ఉన్నాయి!

రామయ్య తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. వణుకుతున్న చేతులతో ఆ సంచి అందుకొని, వకీలుగారికి నమస్కరించి, గుడిసెకు చేరుకొన్నాడు. ఒక్కసారిగా అంత సొమ్ము కళ్ల చూడటం రామయ్యకు ఇదే మొదటిసారి; నిజానికి ఇది అతను కలలోనైనా తలపరాని విషయం. యజమాని సుబ్బరాజుగారు



విదేశానికి వెళ్లకముందు, వారికి రామయ్యే తోటమాలి. రామయ్య మంచి నమ్మకస్థుడు. మరి, రాజుగారు వెళ్ళిన తరువాత వారి వ్యవహారాలన్నీ ఒక గుమాస్తా చూస్తూ వున్నాడు. ఆ గుమాస్తా బలే టక్కరి. రామయ్యకూ అతనికీ పడకపోవటం చేత, రాజుగారి కొలువులోనించి రామయ్య వెంటనే తప్పుకోవలసి వచ్చింది.

ఇప్పుడు రామయ్య ఒక మార్వాడీ శేఠ్ తోటలో పనికి కుదురుకొన్నాడు. ఆ యజమానికి గులాబ్ అని ఒక పదేళ్ల కొడుకు. వాడు చురుకైనవాడు, ఐతే, గజదొంగ. ఆ కుఱ్ఱవాడు రామయ్య దగ్గర ఎక్కువ చనువుగా ఉండేవాడు. ముప్పొద్దులా రామయ్య పూరిగుడిసె దగ్గరే ఆటలూ, పాటలున్నూ. రామయ్యకు సంచి చేతికి రాగానే పెద్ద సమస్య పట్టుకుంది. వాడి గుడిసెకు తలుపులు లేవు. ద్వారబంధాలు లేవు. చూడబోతే, గులాబ్ ఎప్పుడూ ఇక్కడనే మసులుతూ వుంటాడు. వాడిని రావద్దనటం ఎలా ?

ఈ విధంగా రామయ్య శతవిధాల ఆలోచించి, ఆనాటి సాయంకాలం ఎవళ్లూ లేకుండా చూసి తోటలో పెద్ద రావి చెట్టెక్కి, దాని తొఱ్ఱలో తన సంచి దాచివేశాడు. ఇంటికి వెళ్ళిపోయాడు. ఇక ఫరవాలేదని రామయ్య ధైర్యపడ్డాడు.

తరువాత యజమాని వద్దకు వెళ్ళి, "బాబూ! నేను ముసలివాణ్ణయిపోయాను, మా ఊరు పోతాను. అక్కడనే కాలక్షేపం చేసుకొంటాను. సెలవిప్పించండి," అని చెప్పిపోదామని ఊహించాడు రామయ్య.

మరునాడు రావలసిన జీతం అడిగి తీసుకొని, ఉదయానే ఊరికి పోదామని ప్రయాణం పెట్టుకొన్నాడు రామయ్య.

మళ్ళీ ఎవరూ చూడకుండా చెట్టు తొఱ్ఱలో పెట్టిన తన సంచి తీసుకొని, వాళ్ళ ఊరు పోయి, సుబ్బరాజుగారు అనుగ్రహించిన ఆ సొమ్ముతో సుఖంగా బతకవచ్చుకదా అని వాడి ఆశ.

రామయ్య ఆశించాడే కాని, కథ అడ్డం తిరిగి, అంతా మరో విధంగా జరిగింది. గులాబ్ యెప్పుడు చూశాడో, ఎలా కని పెట్టాడో కాని, రామయ్య చెట్టు తొర్రలో దాచిన ఆ సంచి చల్లగా కాజేసి, తిన్నగా పట్టుకపోయి తండ్రికిచ్చాడు.

ఇచ్చి, "మన తోటమాలి రామయ్య దీనిని ఒక చోట దాస్తున్నాడు. చూసి, నేను పట్టుకువచ్చేశా, నాన్నా!" అని చెప్పాడు గులాబ్, సంతోషం పట్టలేక.

శేర్‌కి అపరిమితమైన సంతోషం కలిగింది. ఆ సంచిలోని డబ్బు లెక్కించటం గొడవలో పడి, కొడుకు చెప్పిన మాటలేవీ సరిగా వినిపించుకోనే లేదు. "సరిగా రెండు వేలు! రెండు వేలు!!" అంటూ, శేర్ పదే పదే లెక్కింపసాగాడు. "గులాబ్! నీవు పోయి ఆడుకో!" అని చెప్పి, కొడుకును పంపించివేసి, అతడు అదే పనిగా సంచిలో సొమ్ము లెక్కింపసాగాడు.

ఆ రాత్రి రామయ్య యజమాని వద్దకు వచ్చి, "బాబూ! నేను జరుగురుగా మా ఊరికి పోవలిసిన పని పడింది. మళ్ళా ఎప్పుడు వచ్చేదీ చెప్పలేకుండా వున్నాను. సెలవిప్పించండి," అన్నాడు.

ఇందుకు యజమాని, "రామయ్యా! సరే, బయలుదేరే ముందు వచ్చి, నీకు



రావలసింది పట్టుకుపో. ఐతే, చూడు, ఈ ముసలికాలంలో నీకు ఇంత విశ్రాంతి గల నవుకరీ మరొకచోట దొరకటం కష్టం సుమా. ఏమైనా, పదేళ్ళనుంచీ కనిపెట్టుకొని వుంటున్నావు. ఇవాళ మమ్మల్ని విడిచి వెడతావంటే చాలా విచారంగా వుంది," అన్నాడు, ఎంతో అభిమానం ఉట్టిపడుతూ.

పైకి ఇలా విచారం వెల్లడించాడే కాని, "వీడి రెండు వేలూ మనకి దక్కనై కదా. ఈ రోజుతో వీడి పీడ వదిలితేనే అన్నివిధాలా మంచిది," అని తలచి, లోలోపల శేర్ ఎంతగానో సంబరపడుతూనే వున్నాడు.

మరునాడు ఉదయానే రామయ్య జీతం తీసుకొని, పిట్టకు తెలియకుండా పెద్ద రావిచెట్టు దగ్గరకు చేరుకొన్నాడు. తొర్రలో తన సంచి చెక్కుచెదర కుండా, పెట్టినది పెట్టినట్టే ఉండటం గమనించి రామయ్య సంతోషించాడు. "ఆహా! ధర్మం నాలుగు పాదాలా నడుస్తున్నది గదా!" అని మనసులో తృప్తి పడి, రామయ్య తనకు బహుమతిగా లభించిన సంచీ పట్టుకొని ఊరికి వెళ్ళి పోయాడు.

తరువాత గులాబ్ తండ్రి వద్దకు వచ్చి, "నాన్నా, రామయ్య ఎంత నిర్భాగ్యుడు! తానేమో చాలా తెలివిమంతుడనని మురిసిపోయాడు. వాడిని బోల్తాకొట్టించావే. సంచీ ఎప్పుడు కనబడలేదో, అప్పుడే వాడు ప్రాణాలు వదిలేసి వుంటాడు - అమాయకుడు!" అని అన్నాడు.

ఇందుకు శేఠ్ చిరునవ్వునవ్వి, కొడుకును చేరదీసుకొని, "ఒరే నాయనా, గులాబ్! నేను ఆ సంచి యెక్కడదాచానో హరిహర బ్రహ్మాదులకు కూడా తెలియదన్నమాట. అటువంటిది, పిచ్చిపుల్లాయగాడు రామయ్యకా తెలిసేది!" అని చెప్పి, మళ్ళీ నవ్వాడు తన ప్రజ్ఞకు పొంగిపోతూ.

వెంటనే కుర్రవాడు గులాబ్, "ఎక్కడ దాచావు నాన్నా? ఎక్కడ నాన్నా?" అంటూ ఆత్రంతో అడిగాడు.

శేఠ్ కుర్రవాడిని ఇంకా దగ్గరకు తీసుకొని, చెవిలో ఈ రహస్యం చెప్పాడు; "అబ్బాయి! ఎవళ్ళకూ తెలియనివ్వకూ, జాగర్త! మన తోటలో, తూర్పు దిక్కున పురాతనం నించీ ఉన్న పెద్ద రావిచెట్టు తెలుసుకదూ? దాని తొర్రలో దాచిపెట్టాను," అన్నాడు.

ఈ మాటలకు గులాబ్, "అయ్యయ్యో! రామయ్య దాచింది కూడా అక్కడే నాన్నా!! నేను చూసి తెచ్చింది ఆ చెట్టు తొర్రలోనించే!" అంటూ కుప్పలా కూలిపోయాడు.





# పరిసరాలప్రభావం

శిళ్ళంగేరి పట్టణంలో శేషాచలపతి ఒక సామాన్య ఉద్యోగి. పెళ్ళయిన కొత్తలో భార్య విశాలాక్షితో అతడి కాపరం హాయిగా జరిగిపోయింది. కాని, రానురాను ఆ భార్యాభర్తల మధ్య చీటికీ, మాటికీ కీచులాటలు ప్రారంభమయినై.

ఇందుక్కారణం పొరుగున వున్న పెద్ద ఉద్యోగస్థుల భార్యలైన తాయారమ్మా, కనకవల్లీ లాంటి వాళ్ళు. వాళ్ళు తరచుగా కొత్త కొత్త నగలూ, విలువైన పట్టు చీరలూ కొని, మధ్యాహ్నం వేళ కాలక్షేపాని కొచ్చిన విశాలాక్షికి వాటిని చూపిస్తూండేవాళ్ళు. వాటిని చూసి తెగ మెచ్చుకుని ఇంటికి వస్తూనే, భర్తను తనకూ అలాంటి నగలూ, చీరలూ కావాలని పోరుపెట్టుతూండేది, విశాలాక్షి.

శేషాచలపతి తను చేస్తున్న చిన్న ఉద్యోగం సంగతీ, తమ ఆర్థికపరిస్థితీ భార్యకు ఒకటికి రెండుసార్లు ఓపిగ్గా వివరించి చెప్పేవాడు. కాని, విశాలాక్షి గయ్ మంటూ లేచేది.

భార్య పోరు కొన్నాళ్ళు భరించి సహనం కోల్పోయిన శేషాచలపతి మామ సోమరాజుకు, కూతుర్ని పుట్టింటికి తీసుకుపొమ్మని ఉత్తరం రాశాడు. ఎంతో సాధువుగా వుండే అల్లుడు యిలా ఎందుకు ఉత్తరం రాశాడా అని సోమరాజు ఆశ్చర్యపోయి, అప్పటికప్పుడే బయలుదేరి శిళ్ళంగేరి వచ్చాడు.

తండ్రిని చూస్తూనే విశాలాక్షి కళ్ళనీళ్ళు పెట్టుకుని, "నాన్నా, నువ్వు నన్ను ఒక పిసినారికిచ్చి పెళ్ళి చేసి, యీ జన్మకిక సుఖమనేది లేకుండా చేశావు. మీ అల్లుడి తోటి ఉద్యోగుల భార్యలు ఎలాంటి నగలు పెట్టుకుంటున్నారో, ఎంత మంచి చీరలు కట్టుకుంటున్నారో, నువ్వే

కోలార్ కృష్ణఅయ్యర్

చూడు! వాళ్ళ పక్కన నిలబడ్డానికే నాకు తలవంపులుగా వున్నది,'' అన్నది.

సోమరాజు కూతుర్ని అప్పటికి ఏవో ఓదార్పు మాటలతో శాంతపరిచి, ఒంటరిగా అల్లుడితో మాట్లాడాడు.

అతడికి పరిస్థితి అంతా అర్థమైంది. ఆయన అల్లుడితో, ''మీ యిద్దరి మధ్యా కీచులాటలకు మూలకారణం పరిసరాల ప్రభావం. దీన్నంతా సరిదిద్దే మార్గం నే నాలోచిస్తాను,'' అని శేషాచలపతికి సర్ది చెప్పి, వెళ్ళిపోయాడు.

ఆ తరవాత నెలైనా తిరక్కుండానే శేషాచలపతికి గంగాపురం అనే ఒక చిన్న గ్రామానికి బదిలీ అయింది. చలపతి, భార్యతో ఆ గ్రామం వెళ్ళాడు. అక్కడ అతడే అందరికన్న పెద్ద ఉద్యోగి!

విశాలాక్ష యిరుగు పొరుగున వున్న చిన్న చిన్న ఉద్యోగుల భార్యలు తీరిక సమయాల్లో విశాలాక్ష దగ్గిరకు వచ్చి, పెద్ద ఉద్యోగి భార్య అయిన ఆమె అదృష్టాన్ని పొగడడమే కాక, ఆమె కట్టే చీరల్ని, మెడలో వున్న నగలతోపాటు, ఇంట్లో వున్న పాత్రసామగ్రిని కూడా తెగ మెచ్చుకుని, ''అహా, అదృష్టమంటే, నీదే!'' అనేవాళ్ళు. అవసరపడినప్పుడు ఆమె సలహాలు అడిగేవారు.

ఆరునెలలు గడిచాక సోమరాజు తన కూతురు కాపరం ఎలా సాగుతున్నదో చూడవచ్చాడు. శేషాచలపతి, ఆయనతో, ''ఈ ఊరు వచ్చాక విశాలాక్ష పూర్తిగా మారిపోయింది. ఖరీదైన నగలూ, పట్టు చీరల ప్రసక్తే తేవడం లేదు. నాకు చాలా ఆశ్చర్యంగా వుంది,'' అన్నాడు.

సోమరాజు తృప్తిగా నవ్వి, ''నీకు లోగడ చెప్పాగదా, అంతా పరిసరాల ప్రభావం! అక్కడ అంతస్తూ, హోదా వున్నవాళ్ళతో పోల్చుకుని, తానెంతో కింది స్థాయిలో వున్నానని బాధపడేది. ఇక్కడ అలా కాక ఆమెదే పై అంతస్తూ, హోదా కూడా. మీ యిద్దరూ యింత కలుపుగోలుగా వుండడం, సంతోషం కలిగిస్తున్నది,'' అన్నాడు.





# విఘ్నేశ్వరుడు

కుమారస్వామికి తన పెళ్ళి ఆగిపోవడానికి కారణమైన విఘ్నేశ్వరుడి మీద గుర్రుగా ఉంది.

ఒకనాడు అతడు తల్లితో, "వాజమ్మ కాక జేజెమ్మ ఎలాగౌతాడమ్మా అన్న! నలుగుముద్ద తిండిముద్దకే గాని ఘనకార్యం చేయగలడా?" అన్నాడు ఎకసక్కెంగా.

వినాయకుడు గుడ్లనీరు పెట్టుకొని, "చూడమ్మా! తమ్ముడు ఎంతలేసి మాటలంటున్నాడో..." అంటూ ఏడ్చినంత పని చేశాడు.

పార్వతికి కూడా కోపం వచ్చింది. వినాయకుణ్ణి అక్కున చేర్చుకొని బుజ్జగిస్తూ, "నాన్నా, నేను చేసిన బొమ్మవని వీళ్లకు అక్కసురా! తండ్రి చంపనే చంపేశాడు, తమ్ముడు ఇలాగ దెప్పుతున్నాడు. పోనీలే, వాళ్ళ అజ్ఞానం వాళ్ళకే తలవంపు!" అంది.

"తమ్ముడు అజ్ఞాని అయితే అవుతాడు గాని, నాన్నకు అజ్ఞానం ఏమిటమ్మా, నీ పిచ్చిగాని...." అన్నాడు గణపతి ఆశ్చర్యంగా.

పార్వతి ఏదో తలంచుకొని, "నాకు కాదురా పిచ్చి, ఆ శంకరమహాదేవుడికే పిచ్చి ఎక్కి విష్ణుదేవుడి జగన్మోహిని అవతారం వెంటబడి నవ్వులపాలవలేదా ఏమిటి!" అన్నది.

"ఆ తర్వాతేం జరిగిందమ్మా?" అన్నాడు గణపతి.

8. ప్రమథగణాధిపత్యం



"అదా సంగతి! భార్యారత్నాలు అంటే అంత భయంకరం అన్నమాట, అందుకే నేను పెళ్ళిచేసుకోనమ్మా!" అన్నాడు గణేశుడు.

కుమారస్వామి అందుకొని, "అదే నీ ఘనకార్యం! నేను యిప్పుడేపోయి సూర్యుణ్ణి చుట్టివస్తాను!" అంటూ నెమలి నెక్కి తుర్రుమన్నాడు.

విఘ్నేశ్వరుడు తిన్నగావెళ్లి మేరు పర్వతం ఎక్కి చిట్టచివర శిఖరాగ్రం మీద కూర్చున్నాడు.

మేరుపర్వతం చుట్టూరా సూర్యుడు తిరుగుతూంటాడు, అక్కడ సూర్యాస్త మయం అనేది ఉండదు.

కుమారస్వామి శ్రమపడి సూర్యుడి చుట్టూరా ప్రదక్షిణం చేసి వచ్చి అన్న మేరుపర్వతం ఎక్కి కూర్చున్నాడని తెలుసుకొని, విచారంగా ముఖం వేలవేసి ఊరుకున్నాడు.

"ఏం కుమారా, అలా తల వేలాడ దీసుకున్నావు?!" అని పార్వతి ఆశ్చర్య పోతూ అడిగింది.

"అమ్మా! నేను సూర్యుడి చుట్టూరా తిరిగితే అన్న సూర్యుణ్ణే తన చుట్టూరా త్రిప్పుకొంటున్నాడమ్మా! నిజం చెప్పా లంటే అన్న చేసినదే ఘనకార్యం!" అన్నాడు కుమారస్వామి.

"ఏదో ఘోరమే జరిగింది, వాళ్ళిద్దరి మధ్యా ఒక భైరవుడనే కారు చీకటి లాంటి భూతపిల్లడు పుట్టాడట!" అంది తల్లి.

"భైరవు డెక్కడుంటాడమ్మా? వాణ్ణి చూడాలనివుంది!" అన్నాడు కొడుకు.

"ఎక్కడో ఉంటాడు. నల్లటి బట్టలు కడతాడట, వాడి దగ్గిరికి పొరబాటున కూడా వెళ్ళకుమీ, ఝడుసుకుంటావు!" అంది పార్వతి.

"ఝడుసుకోవడమంటే ఏమిటమ్మా? అది కూడా తెలుసుకోవద్దూ?" అన్నాడు గణపతి.

"పెళ్ళాడితే తెలుస్తుంది!" అంది పార్వతి.

కొద్దిరోజుల తర్వాత పార్వతి మళ్ళీ పెళ్ళి ప్రస్తావన తెచ్చింది.

"అమ్మా! సౌందర్యంలో నీకు సమఉజ్జీ అయిన సుందరి కనిపిస్తే పెళ్లాడాలని ఉందమ్మా!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

పార్వతి చురక తగిలినట్లు పెదవి కరుచుకొని, "అలాగైతే ఇంటి మొగసాల కూర్చొని, దారివెంట వచ్చేపోయే వాళ్లను చూస్తూండరా, కుంకా!" అంటూ కదిలింది.

"అలాగే తల్లీ! నీ ఆజ్ఞ!" అని వినాయకుడు వీధిలో కూర్చుని కొంతసేపు తూర్పుకి మరికొంతసేపు ఉత్తరంకూ, అలాగ ఎనిమిది దిక్కులకూ ముఖంపెట్టి చూడసాగాడు.

పార్వతి అతని వింత చేష్టకు వింతగా చూసి, "ఏం నాయనా, కనిపించిందా?" అని అడిగింది.

విఘ్నేశ్వరుడు, "అమ్మా! ఏ దిక్కు చూచినా నాకు మరేదీ కనిపించలేదు, జగజ్జననివైన నీవే ఎనిమిది చేతులతో ఎనిమిది దిక్కులా కనిపిస్తున్నావమ్మా!" అన్నాడు.

పార్వతిఆనందంతో మైమరిచిపోయింది. "నాయనా! విఘ్నరాజా! అందరు దేవుళ్లూ తూర్పుముఖంగా ఉండి పూజలందుకోవాలని నియమం ఉంది గాని, నీవు ఎటు ముఖంపెట్టి ఉన్నా ఆరాధనీయుడవే!" అని వరం యిచ్చింది. అతని పెళ్ళి మాటే మర్చిపోయి, ముద్దులకొడుకు మురిపెంపు






మాటలు శివుడితో ఒకటికి రెండుసార్లు చెప్పి చెప్పి అనందించింది.

చివరకు పార్వతి పట్టుబట్టి పెళ్ళి ప్రస్తావన తెచ్చింది. "అమ్మా! తమ్ముడు దేవసేనాధిపతి పదవిలో ఉన్నాడు, అతను ఇద్దర్ని పెళ్ళాడినా తగును. నేను ఊరికే తింటూ కూర్చున్నాను. ఎలా పెళ్ళి చేసుకునేది?" అన్నాడు విఘ్నరాజు.

శివుడు, "నువ్వు నా ప్రమథగణాలన్నిటికీ గణనాథుడివిగా ఉండు!" అన్నాడు.

"నాన్నగారూ! ఉండమంటే సరా? అర్హత ఉండాలిగదా! తమ్ముడు ఎలాగూ సేనాధిపత్యంలో ఆరితేరి ఉన్నవాడు, ఉండనే ఉన్నాడుగదా!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

ప్రమథులు కుమారస్వామినే అభిమానించారు. శివుడు, "లేదు, నా గణాలకు గణనాథుడుగా విఘ్నేశ్వరుడే ఉండాలి! కుమారస్వామికి దేవసేనాధిపత్యం ఉండనే ఉంది, అదీగాక రెండు పనులు చూసుకోవడం శ్రమ కూడా!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "నాన్నగారూ, ఏదైనా పరీక్షపెట్టి నెగ్గినవారికే గణనాయకత్వం యివ్వడం సమంజసంగా ఉంటుంది గదా!" అన్నాడు.

దేవతలు, ప్రమథులు కలిసి ఒక షందెం పెట్టారు. ఈ భూమ్మీదున్న అన్ని క్షేత్రాల్ని, తీర్థాల్ని ఎవరు ముందు సేవించి తిరిగివస్తారో వారు గెల్చినట్టు అని.

కుమారస్వామి నెమలి మీద ఎగిరి వెళ్ళాడు. వినాయకుడు చక్కా చతికిల బడి కూర్చున్నాడు.

అప్పుడు విష్ణువు అతణ్ణి ఏకాంతానికి తీసుకెళ్ళి, "నాయనా! మేము నిన్ను అభిమానిస్తున్న వాళ్ళం. నీ ఓటమి మా దేవతలందరి ఓటమీ అవుతుంది. మాకు తల వంపులు తేవడం నీకు భావ్యంకాదు. అదీగాక తండ్రి గొప్పదనం తనయుడు నిరూపించితేనే జన్మసార్థకత అవుతుంది. నువ్వేమీ తిరగనక్కరలేదు. నేను చెప్పి

నట్టు చేస్తే చాలు!'' అని విఘ్నేశ్వరుడి చెవిలో రహస్యం ఉపదేశించాడు.

పార్వతి 'హమ్మయ్య' అనుకుంటూ విష్ణువును కృతజ్ఞతగా చూసింది.

విఘ్నేశ్వరుడు మఠం వేసి కన్నులు మూసి శివపంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూ కూర్చున్నాడు.

కుమారస్వామి వెళ్ళినచోటల్లా అంతకంటే ముందే విఘ్నేశ్వరుడు ఎలుక మీద వచ్చి తీర్థమాడి సేవించి వెళ్ళినట్లు తెలుసుకొని ఆశ్చర్యపడుతూ హతాశుడై తిరిగి వస్తూనే తాను ఓడిపోయినట్లూ విఘ్నేశ్వరుడిదే విజయమని చెప్పాడు.

విఘ్నేశ్వరుడు తమ్ముడితో చేతులు కలిపి శివుడి వద్దకు తీసుకెళ్లి, ''తమ్ముడూ! నేను జయించనూ లేదు, నీవు ఓడనూ లేదు. మనం ఇద్దరం నిమిత్తమాత్రులం. జయించింది నాన్నగారే! శివపంచాక్షరీ మహిమ అలాంటిది. గెలిచినది శివనామం గెలిపించింది విష్ణువు!'' అని జరిగింది చెప్పాడు.

విఘ్నేశ్వరుడు కుమారస్వామి చేరో పాదమూ పట్టుకొని తండ్రికి మ్రొక్కారు.

కుమారస్వామి అందరి మధ్య నిలబడి, ''విఘ్నేశ్వరుడికి ప్రమథ గణాధిపత్య పట్టాభిషేకం సత్వరమే జరగాలి, శివుని ఆజ్ఞ అందరికీ శిరోధార్యము!'' అని నొక్కి చెప్పాడు.

దేవతలు సంతోషించారు. సిద్ధ, సాధ్య, యక్ష, భూత గణాల వారంతా హర్షం





ప్రకటించారు. ప్రమథగణప్రముఖులైన భృంగీశ్వర, శృంగీశ్వర, చండీశ్వర, నందీశ్వరులు మాత్రం వ్యతిరేకించారు. లోగడ పుత్రగణపతి రూపంతో వాళ్ళను విఘ్నేశ్వరుడు శృంగభంగం చేశాడు.

ఆ అక్కసుతో వారు, "కుమారస్వామికి తన బలాలు అంటూ దేవగణ సేనలు ఉన్నాయి, మేము శివుడి నమ్మిన బంట్లుగా శివగణంగా మొదటినుంచీ పరిగణింపబడుతున్నాం. అటువంటప్పుడు విఘ్నేశ్వరుడు మాకు అధిపతి ఎలాగ అవుతాడు? గణపతి అనిపించుకోడానికి కూడా అతనికి తనది అంటూ ఎలాంటి బలగమూ లేదు, గణాధిపత్య పట్టాభిషేకం దేనికి?" అని కుళ్ళు వెళ్ళబోసుకున్నారు.

శివుడు కళ్ళెర్రజేశాడు. "నా నిర్ణయాన్నే అధిక్షేపించగలంత గొప్పవారైపోయారా మీరు!" అని ప్రమథనాయకుల్ని ఈసడించుకున్నాడు.

విఘ్నేశ్వరుడు శాంతంగా, "ఔను, ఔను, నిజమే నా గణాలు ఎక్కడ? ఏవీ? లేవు, లేవు కాబోలు! అన్నట్టు పుత్రగణపతిగా ఉన్నప్పుడు నాకూ కొంత బలగం ఉన్నట్టు అనుమానం, ఆ గణాలు ఎక్కడ? ఎక్కడ?" అని అరిచాడు.

అప్పుడు కోటానుకోట్ల విఘ్నేశ్వరుడిలాంటి వారు దిక్కులు ఈనినట్టు పుట్టుకొచ్చి దిక్కులు పిక్కటిల్లేలాగ జయజయ ధ్వానాలు చేస్తూ విఘ్నేశ్వరుడి బలాలుగా వచ్చి నిల్చున్నారు.

వారందరికీ తలా నాలుగు చేతులున్నాయి. నాలుగు చేతుల్లో అనేక ఆయుధాలు, పరికరాలు, చిత్రవిచిత్ర వస్తుజాలమూ ఉన్నాయి. కొందరి చేతుల్లో గంటాలు, లేఖినులు, కుంచెలు, రంగులు ఉంటే మరికొందరి చేతుల్లో శూలాలు, విల్లమ్ములు, కత్తులు, గదలు ఉన్నాయి. కొందరు కొడవళ్ళు, సుత్తులు, కత్తులు, రంపాలు, ఉలులు, శేనాలు పట్టుకొని ఉన్నారు. మరికొందరు వీణలు, మృదం

గాలు, వేణువులు, డప్పులు వాయిస్తున్నారు. మూలికలు, ఔషధాలు, పానీయాలు, నాగళ్ళు, రాట్నాలు, నవరత్నాభరణాలు, పూలమాలలు, పండ్లూ, తినుబండారాలు మొదలైనవెన్నెన్నో పట్టుకొని ఉన్నారు. వారి మధ్య దేవుళ్ళూ దేవతలూ ప్రమథాదిగణాలవాళ్ళు బియ్యంరాశిలో రాళ్ళలా అక్కడక్కడ కనిపించారు.

విఘ్నేశ్వర రూపులు కొందరు అకాశంలో ఎగురుతూ అంతరిక్షానికి దూసుకుపోతున్నారు. ఆ గణాధిపగణాల చేతుల్లో ఛత్రచామరాలు, వీవనలు, వింజామరాలు ఆడుతున్నవి. ఆకాశంలో రెపరెపలాడుతున్న అరుణారుణపతాకాల్ని, ఇంకా అనేక రంగురంగుల ధ్వజాల్ని పట్టుకొని ఉన్నారు. వారు రత్నభూషితమైన పెద్ద భద్రసింహాసనాన్ని తెచ్చారు. విఘ్నేశ్వరుణ్ణి దానిపై కూర్చుండబెట్టి ఛత్రచామరాలు పట్టారు. శ్వేతఛత్రం ముత్యాల జాలరులతో ప్రకాశించింది. చిట్టెలుక సింహాసనం కింద చిందులు వేసింది.

పార్వతి మరొకసారి మళ్ళీ మైమరిచి భద్రసింహాసనాశీనుడైన విఘ్నేశ్వరుడికి నమస్కరించబోయింది. "అమ్మా! అమ్మా! వద్దు, నీ ముద్దుల కుమారుణ్ణి." అని విఘ్నేశ్వరుడు వారిస్తూ చేతులూపేసరికి అంతా అదృశ్యమై, విఘ్నేశ్వరుడు ఒక్కడూ వినయంగా తల్లికి ప్రణమిల్లాడు.

"విఘ్నేశ్వరా!" అన్న పిలుపు శంఖధ్వనిలా వినిపించింది. ఆ పిలిచింది విష్ణువు. విఘ్నేశ్వరుడు అటు చూడకుండానే, "నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు!" అన్నాడు.

"నీకు తెలిసినా, అది అందరికీ కూడా తెలియాలికదా, అదే చెబుతున్నాను!" అంటూ విష్ణువు, "విఘ్నేశ్వరుడి పెళ్ళి వేయి విఘ్నాలసామెతగా విఘ్నేశ్వరుడు కల్పించుకొన్న విఘ్నాలు ఇప్పటికి వెయ్యీ పూర్తయ్యాయి! ఇటు పైని విఘ్నం కల్పించుకోడానికి వీల్లేదు, కల్పించుకొన్నా చెల్లదు!" అని గట్టిగా పలికాడు.





# ఇద్దరు మోసగత్తెలు

## 8

జురేక్ భార్యను పిలిచేందుకు దుకాణం వదిలిపోగానే పాదరసం చప్పున దీనారాల సంచి మీద చెయ్యివేశాడు. వెంటనే దుకాణం నాలుగు మూలల నుంచీ డప్పుల మోతా, గంటల మోతా విని పించింది. జురేక్ దుకాణంలోకి వచ్చి, సంచీ వదిలి పారిపోతున్న పాదరసం మీదికి సీసం గుండు బలంగా విసిరి వేశాడు. ఆ దెబ్బకు పాదరసం సొమ్మ సిల్లి వీథిలో పడిపోయాడు. తరవాత కుంటుతూ అహ్మద్ ఇల్లు చేరాడు.

ఇదంతా చూస్తున్న వాళ్ళు జురేక్‌ను నానాతిట్లూ తిట్టారు. "నీ పాపిష్ఠి డబ్బుతో అందరికీ ఆశ చూపింది చాలక, నిండు మాలాల్ని సీసం గుండుపెట్టి కొడతావా? నువు మనిషివా, పశువ్వా?" అన్నారు వాళ్ళు.

"ఈ వేదాంతాలకేం లే?" అన్నాడు జురేక్ నిర్లక్ష్యంగా.

దెబ్బనుంచి కాస్త కోలుకోగానే పాదరసం జురేక్ దుకాణానికి మళ్ళీ బయలు దేరాడు. అతను జురేక్ చేతిలో చావటాని కైనా సిద్ధపడ్డాడుగాని, జీనాబ్‌ను పెళ్ళాడే యత్నం మానటానికి ఒప్పుకోలేదు.

ఈసారి పాదరసం ఒక నౌకరు వేషం వేసుకుని జురేక్ దుకాణానికి సంచీ పట్టు కెళ్ళి, "వేయించిన చేపలు వేడివేడిగా ఇప్పించండి," అని అడిగాడు.

"వేడిగా కావాలంటే నిప్పు చేసిన దాకా ఆగు!" అంటూ జురేక్ అవతలికి వెళ్ళాడు. వెంటనే పాదరసం డబ్బు సంచీ పట్టుకున్నాడు. మళ్ళీ గంటలూ, డప్పులూ మోగాయి. ఒక్క దూకున జురేక్ దుకాణంలో వచ్చిపడి, "నీవేషం



బుట్టలో మూడు తాచులు పెట్టుకుని జురేక్ దుకాణం ముందు వాటిని ఆడించ సాగాడు. ఆడిస్తున్నట్టే ఆడిస్తూ పాదరసం ఒక కోడెతాచును, దుకాణంలోకి, జురేక్ కాళ్లముందు పడేట్టు విసిరివేశాడు. జురేక్ హడలెత్తి అవతలికి పారిపోయాడు. ఆ గందరగోళంలో పాదరసం డబ్బు సంచీని అందుకున్నాడు. కాని మరుక్షణంలోనే జురేక్ తిరిగివచ్చి, ఒక సీసం గుండుతో పాముతల చితకగొట్టి, మరో గుండు పాద రసంవేపు విసిరాడు. గుండు వెళ్లి వీధివెంట పోయే ముసలిదానికి తగిలి, ఆమెను తక్షణమే పరలోకానికి పంపేసింది.

చుట్టుపక్కలవాళ్లంతా జురేక్‌ను తన్న బోయారు. వారికి భయపడి జురేక్ మండిగంలో నుంచి ఆ సంచీ తీసేసి, వంట ఇంట్లో గొయ్యి తవ్వి, అందులో దాన్ని పూడ్చేశాడు.

"సంచి దించనే దించావు. ఆ డబ్బు పిల్లవాడి పుట్టినరోజు పండక్కు ఖర్చు చేద్దాం," అన్నది జురేక్ భార్య. కాని జురేక్ వినలేదు. ఆ రాత్రి జురేక్‌కు ఒక కల వచ్చింది. ఏదో పక్షి తన వంట ఇంట్లో ముక్కుతో తవ్వి డబ్బుసంచీ పైకి లాగుతున్నదిట. జురేక్ కంగారుపడుతూ లేచి భార్యతో, "ఒసే, ఏదో పక్షి వంట ఇంట్లో తవ్వుతున్నది. వెళ్లిచూడవే!" అన్నాడు.

నేను కనిపెట్టలే దనుకున్నావురా?" అంటూ సీసం గుండు పాదరసం తలకి గురిపెట్టి బలంకొద్దీ విసిరాడు. పాదరసం సమయానికి వంగాడు. సీసంగుండు నేరుగా వీథిలోకి వెళ్ళి ఒక నౌకరు తీసుకు పోతున్న పెరుగుముంతకు తగిలింది. పెరుగంతా చింది వెనకే వస్తున్న ఒకానొక కాదీ ముఖానా, గడ్డంమీదా పడింది.

దగ్గర ఉన్నవాళ్ళు జురేక్‌తో, "కాదీ గారు నీ పాపిష్టి డబ్బుకు వడ్డీ లెక్కకట్టి వడ్డించకపోతే చూడు!" అన్నారు.

రెండు ప్రయత్నాలు విఫలమైనా పాద రసం ఆశ విడిచిపెట్టలేదు. అతను మూడో సారి పాములవాడి వేషం వేసుకుని,

జురేక్ భార్య దీపం తీసుకుని వంట ఇంట్లోకి వెళ్ళింది. అక్కడ పక్షి అయితే లేదుగాని, కిటికీలోనుంచి ఎవరో దూకి పోవటం మటుకు ఆమె కళ్ళపడింది. ఆ మనిషిచేతిలో డబ్బుసంచీ ఉంది!

అది కాజేసినవాడు పాదరసం అలీయే. అతను అక్కడే ఉండి, సంచీని వంట ఇంట్లో దాయటం గమనించి, రాత్రి వచ్చి దాన్ని కాస్తా సంగ్రహించాడు.

"నీ నోరుబడ! డబ్బు పిల్లవాడి పుట్టిన రోజుకు ఖర్చుచెయ్యమంటే లేదన్నావు! ఇప్పుడది కాస్తా దొంగవాడు దోచుకు పోయాడు!" అని జురేక్ భార్య ఏడిచింది.



"అదెక్కడికి పోతుందే? ఇప్పుడు తీసుకురానూ?" అంటూ జురేక్ హడావిడిగా అక్కడినుంచి బయలుదేరాడు.

"సంచీ లేకుండా వచ్చావో, నీకు తలుపు కూడా తెరవను!" అన్నది భార్య.

ఈ సంచీ కోసం మూడు యత్నాలు చేసిన దెవరో జురేక్‌కు బాగా తెలుసు. పాదరసం కొత్వాలు అహ్మద్ ఇంట్లో ఉంటున్నట్టు కూడా ఆయన ఎరుగు. అందుచేత ఆయన అడ్డదార్ల వెంబడి ముందుగా అహ్మద్ ఇల్లు చేరి, మారు తాళంతో బయటి తలుపు తెరిచి, దాని వెనక్కు వెళ్ళి మూసి, పాదరసం కోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

ఇంతలో పాదరసం వచ్చి తలుపు తట్టాడు. జురేక్ అహ్మద్ గొంతుతో, "పాదరసం, నువేనా?.... సంచీ తెచ్చావా?.... ఏదీ? తలుపు కిందుగా లోపలికి తొయ్యి! నేనూ, హసన్ పందెం వేసుకున్నాంలే! అంతా చెబుతా!" అన్నాడు.

ఆ మాట్లాడేది అహ్మదే ననుకుని పాదరసం సంచీని తలుపు కిందుగా లోపలికి తోశాడు. జురేక్ అది తీసుకుని అహ్మద్ ఇంటి మెట్లెక్కి మిద్దె మీదికి పోయి, ఆ మిద్దె మీది నుంచి పక్క మిద్దె మీదికి దాటి, అవతలి ఇంటి మెట్లు దిగి, ఆ యింటి తలుపు తెరుచుకుని వీధి ఎక్కి, పరమానందంతో ఇంటివేపు సాగాడు.

పాదరసం ఒకటి రెండుసార్లు తలుపు తట్టి చూశాడు. ఏ అలికిడీ లేదు. జురేక్ తనను మోసగించాడా అనుకున్నాడు. వేగంగా అడ్డదార్ల వెంబడి పరిగెత్తి జురేక్ ఇల్లు చేరాడు, లోపలికి ప్రవేశించాడు. మిద్దెమీద పడకగదిలో జురేక్ భార్య పిల్ల వాణ్ణి పెట్టుకుని నిద్రపోతున్నది. పాద రసం ఆమె లేచేలోపల చేతులూ, కాళ్ళూ కట్టేశాడు. కుర్రవాణ్ణి ఒక తట్టలో పడుకో బెట్టి జురేక్ కోసం తలవాకిట వేచి ఉన్నాడు.

ఇంతలో జురేక్ వచ్చి తలుపుతట్టాడు. పాదరసం జురేక్ భార్యగొంతుతో, "సంచీ దొరికిందా ?" అని అడిగాడు.

"ఇదుగో, తెచ్చాను," అన్నాడు జురేక్.

"బుట్టలో పెట్టు. డబ్బు లెక్కచూసు కునిగాని తలుపు తెరవను." అన్నాడు పాదరసం, జురేక్ భార్యగొంతుతో. అతను ఒక చిన్న బుట్టకు తాడు కట్టి దించి, సంచీ పైకి చేదుకున్నాడు. తరవాత సంచీ తీసు కుని, పిల్లవాడున్న తట్ట ఎత్తుకుని అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఎంతసేపటికీ తలుపు తెరుచుకోక పోవటం చూసి జురేక్ తలుపుమీద బాద నారంభించాడు. చుట్టుపక్కల వాళ్ళంతా చేరారు. ఎన్ని కేకలు పెట్టినా అతీ గతీ లేదు. చివరకు అందరూ కలిసి తలుపులు పడదోసి లోపలికి వెళ్ళిచూస్తే జురేక్ భార్య మంచానికి కట్టేసి ఉంది. సంచీ జాడలేదు సరికదా, పిల్లవాడు కూడాలేడు!

జురేక్ తన భార్య కట్లు విప్పి జరిగిన దంతా తెలుసుకుని, జుట్టు పీక్కుని, అప్పుడే అహ్మద్ ఇంటికి వెళ్ళి దబదబా తలుపుతట్టాడు. అప్పటికే తెల్లవారు తున్నది. లోపల అంతా మేలుకునే ఉన్నారు. జురేక్ పాదరసం అలీని చూస్తూనే, "డబ్బుసంచీ నువు సంపా దించుకున్నావనుకుంటాను. నీకు పుణ్యం ఉంటుంది. నా పిల్లవాణ్ణి న్నా నా కిచ్చెయ్యి!" అని వేడుకున్నాడు.

(ముగింపు వచ్చే సంచికలో)



# లోభి ఇంట భోజనం

ఒక శనివారం రాత్రిపూట రంగయ్యగారింటికి భోజనవేళ దాటిన సమయంలో వచ్చినపని పూర్తికానందున ఉదయమే చూసుకొని వెళదామని, నలుగురు దూరపు బంధువు లొచ్చారు.

రంగయ్య పరమ లోభి.

బంధువులకు వంట ప్రయత్నం చేస్తున్న భార్య వద్దకు వెళ్ళి, "నలుగురికి మానెడు బియ్యం వండితే ఇల్లు గుల్లవుతుంది. కాబట్టి తవ్వెడు వండి, వడ్డించే సమయంలో ఈ పూట బియ్యం నిండుకున్నాయని చెప్పు," అన్నాడు.

వారికి కడుపు నిండా భోజనం పెట్టలేని కారణం అదే అన్నట్లుగా.

అకలిగా ఉన్న బంధువులకు కడుపునిండా భోజనం పెట్టలేనందుకు విచారిస్తూ, రంగయ్య భార్య కొద్దిగా చనువున్న బంధువుకు భర్త యొక్క లోభి గుణం వివరించి, "మీకు తృప్తిగా భోజనం పెట్టలేనందుకు విచారిస్తున్నాను," అంది.

దానికి ఆ బంధువు ఆమెను ఓదార్చుతూ, "నువ్వేమీ బాధపడకమ్మా! నీ భర్త గుణం తెలిసే మాలో ప్రతి శనివారం పచ్చి మంచినీరు కూడా ముట్టుకోకుండా ఉపవాసముండే ఇద్దరి సంగతి చెప్పలేదు. వండిన వంట ఇద్దరికి సరిపోతుంది," అన్నాడు.

—రేవా నాగేశ్వరరావు



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







S. B. Takalkar    Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఆగష్టు నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకి పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వీణ పట్టిన అబల

రెండవ ఫోటో : ఎలా వాయిస్తావు తబలా ?

పంపినవారు : ఎమ్. మోజెస్, చలకుర్తి, (నల్గొండ జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.




ప్రత్యేక
బహుమతి
25 పై
తగ్గింపు

# ఇదిగో!
# పెప్పర్‌మెంట్ రుచి కలిగిన ఒక చాక్‌లెట్ బిస్కట్

## స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి. స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...





## స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345




అందమైన, ఆరోగ్యకరమైన
దంతాలున్నాయంటే
ఫ్యామిలీ టూత్ పౌడర్
దానికి కారణమని
నిస్సందేహంగా చెప్పవచ్చు.

కారణం

ఫ్యామిలీ టూత్ పౌడర్ మీరు
అనునిత్యం ఉపయోగించుట
ప్రారంభిస్తే మెత్తని, తెల్లని
ఫ్యామిలీ టూత్ పౌడర్
మీ దంతాలను పరిశుభ్రం
చేస్తుంది. ముత్యాల వలె మెరి
పిస్తుంది. ఫ్యామిలీ టూత్
పౌడర్ మీ దంతాలకు
శ్రీరామరక్ష.
బ్రష్‌తో వాడుకొనే విధంగా
సరసమైన ధరలో
మీ కుటుంబ సభ్యులందరి
కోసం రూపొందించబడింది.

**ఫ్యామిలీ టూత్ పౌడర్**

తయారుచేయువారు:
శ్రీరామా ఇండస్ట్రీస్,
గుంటూరు.







SHANKAR ADV.S.

---

## ఇంగ్లీషులో మాట్లాడాలనుకొంటున్నారా?

## ఆంగ్లభాషా సంభాషణ బోధిని

**వెల రు. 12-00**

ఈ పుస్తకమును మంచి ఉచ్చారింపుతో అర్థంచేసుకుంటూ 6 సార్లు బాగుగా చదివిన ఎడల ఇతరులు, ఎదుటివారు ఇంగ్లీషులో మాట్లాడునప్పుడు వారితో ఇంగ్లీషులో మాట్లాడుటకు, అర్థం చేసుకుని జవాబులు చెప్పవచ్చును.

తపాలా ఖర్చు రు. 3-00 అధికముగా పంపుతూ పుస్తకము కొరకు వ్రాయవలయును. ఎ. పి. ఒ. లో యుంటున్నవారు పూర్తి వెల ముందుగా పంపవలయును.

### గీతారామ్

నెం. 11, ఎస్. ఎమ్. దొరై అరసన్ స్ట్రీట్,
కావేరిరంగన్ నగర్, సాలిగ్రామం, మద్రాసు-600093

# న్యూట్రమూల్ మిగతావాటికన్నా ఇంచుమించు 4 రూపాయలు చవక.

దానికి కారణం యిది- అమూల్ లోకంలో అత్యుత్తమమైనది, మిగతా వాటికన్న తక్కువ ఖరీదు గనక. ఇక అమూల్ పేరులోనే ఉంది మరింత రుచిగల పానీయం అనే హామీ, మరింత మీగడతో నిండిందని. మరింత పెరుగుదల నిచ్చేదని. మరిక మిగతా వాటికంటే యింకెంతో పొదుపు। ఇకనుంచీ మీ కుటుంబానికంతటికీ నాణ్యత గలిగిన, ఆరోగ్యాన్నిచ్చే పానీయమైన న్యూట్రమూల్ యివ్వండిక. దాంతోటే డబ్బు పొదుపు చేసుకోండి. న్యూట్రమూల్ వస్తాదుగా అవండిక.

ఇటువంటి ఆహార పానీయాల ధరల పోలిక (రూ.)*

| | 500 గ్రాం | 800 గ్రాం | 1000 గ్రాం |
|---|---|---|---|
| న్యూట్రమూల్ | 13.83 | - | 26.67 |
| మాల్టోవా | 17.58 | - | - |
| బోర్న్‌విటా | 17.68 | 26.97 | - |
| బూస్ట్ | 18.87 | - | - |









మార్కెట్ చేసేవారు :
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్,
ఆనంద్, గుజరాత్

deCunha-GCM-45 TL




వారెవ్వా! వహ్వా!
ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

PIES FOR SALE

it's better to have pie fought than not at all

CAUTION PIE FIGHT IN PROGRESS

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!